శ్రీ

శుభమస్తు.

# వైద్యప్రకాశిక

సంపాదకులు:

టీ. వి. భాస్కర్

శ్రీ జ్యోతిర్విద్యాయుర్వేదవైద్యాలయము

మహబూబునగరము - దక్కన్.



చెన్నపురి:

శ్రీ 'రామ' ముద్రణాలయమున

ముద్రితము.

[వెల అణాలు 8.



# వి ష య సూ చి క.

సంఖ్య. | | పుటసంఖ్య



శ్రీ. టి. అయ్యలు వెంకన్న గారు.

జననము : 21 [illegible] 18[illegible]

కీ॥ శే॥ : 14 [illegible]

# శ్రీ ర స్తు.

# శ్రీ తిప్పరవారి వంశావళి.

శా. శ్రీరమ్యంబగు తిప్పరాన్వయమునన్ శ్రీ వేంకటేశాంఘ్రిసే
వారాజద్విమలాంతరంగుఁడు మహాభాగ్యాకరుండయ్యలిం
పారన్బుట్టెను భాస్కరాన్వయమునం దత్యంతవిజ్ఞానవి,స్తా
రుండాఖ్యుఁడు రాఘవేశ్వరుఁ డిలన్ జన్మించుచందంబునన్.

క. ఆవిబుధుఁడు వరియించెన్
శ్రీవనితన్ హరి వరించురీతిగ లక్ష్మీ
దేవమ్మన్గడుఁ గూర్మిన్
బావనమతులెల్లఁ దన్ను బ్రస్తుతిసేయన్. ౨

ఉ. ఆసతియందుఁ గూర్మిఁ గనె నైనయ్యలు బిడ్డల నిర్వురన్ మహా
భాసురశీలలన్ విబుధవర్ణితసద్గుణజాలలన్ దయా
వాసల శ్రీశుదివ్యపదభక్తివిశాలల నిత్యసత్కలా
భ్యాసల దుష్టమానసవిఘాలలఁ బూర్ణశశాంకఫాలలన్. 3

ఆ. అందుఁ జిన్నకూఁతు రగు చిన్నయచ్చమ్మ
నింటఁ బెట్టుకొనియు హితులు మెచ్చ
రంగయాఖ్యునకును రమణినిఁ గాఁ జేసె
నామె వెలసె సతతమార్యు లెన్న. ౪

చ. ప్రతిహరివాసరవ్రతము భక్తి నొనర్చుచు విప్రవర్యులన్
యతులను సత్కవీంద్రులను వ్యాకృతివేత్తల శౌరిచింతనా
యతమతులన్ ఖగోళసుకలాఢ్యులఁ బ్రేముడి సత్కరించు
యతిపకుసాటి యేమగువ యన్ సుజనస్తుతిఁ గాంచె నాపె యున్

సీ. ఆచిన్నయచ్చమ్మ కవతరించె న్వెంక
నాఖ్యుఁడు సర్వబుధాళి మెచ్చ
కలిగతవత్సరంబులు నాల్గువేల తొ
మ్మిదినూర్లపై నారు పదునెనిమిది
యగుప్రభవాబ్దాన నలరు జ్యేష్ఠంబున
బహుళపక్షంబునఁ బరగు చవితి
శుక్రవారంబున సూర్యబుధుల్ యుగ్మ
మున రాహుధారుణీపుత్త్రు లరయ

తే. సింహమున శని యుచ్చన జీవకేతు
వులు ఘటంబున వృషభానఁ బూర్వదేవ
గురుఁ డెసంగఁగ శ్రవణానఁ బరగుచుండు
నాలుగవపాదమున జనుల్ మేలనంగ. ౬

క. ఆవెంకన్న కృతార్థుం
డై వెలసెన్ సంస్కృతమున నాంధ్రంబున స
త్కోవిదవినుతాంగ్లంబున
భావజ్ఞులు సంతతంబు ప్రముదము నెందన్. ౭

చ. ప్రతిహరివాసరవ్రతము। భక్తి నొనర్చుచు విప్రవర్యులన్
యతులను సత్కవీంద్రులను। వ్యాకృతివేత్తల శౌరిచింతనా
యతమతులన్ ఖగోళసుక।లాఢ్యులఁ బ్రేముడి సత్కరించు నీ
యతివకుసాటి యేమగువ।యన్ సుజనస్తుతిఁ గాంచెనాపెయున్.

సీ. ఆచిన్నయచ్చమ్మ। కవతరించె న్వెంక
నాఖ్యుఁడు సర్వబు।ధాళి మెచ్చ
కలిగతవత్సరం।బులు నాల్గువేలతొ
మ్మిదినూర్లపై నారు। పదునెనిమిది
యగుప్రభవాబ్దాన। నలరు జ్యేష్ఠంబున
బహుళపక్షంబునఁ। బరగు చవుతి
శుక్రవారంబున। సూర్యబుధుల్ యుగ్మ
మున రాహుధారుణీ।పుత్రు లరయ

తే. సింహమున శని యుచ్చున। జీవకేతు
వులు ఘటంబున వృషభానఁ। బూర్వదేవ
గురుఁ డెసంగఁగ శ్రవణానఁ। బరగుచుండు
నాలుగవపాదమున జనుల్। మేలనంగ. ౬

క. ఆవెంకన్న కృతార్థుం
డై వెలసెన్ సంస్కృతమున। నాంధ్రంబున స
త్కోవిదవినుతాంగ్లంబున
భావజ్ఞులు సంతతంబు। ప్రముదము నెందన్. ౭

సీ. క్రాలెనెవ్వాఁడు వివేకానందసంయమి
విజ్ఞానసుధఁ గ్రోలి విహితబుద్ధి
సలిపె నెవ్వాఁడు ప్రతిచైత్రశుద్ధంబున
జానకీరాము కల్యాణమహార

సవరించె నెవ్వాఁడు శివమందిరమ్ము బీ
రంగూడెపురకుధరంబుపైన

సలిపె నెవ్వాఁడు క్రతువులు వ్రతంబులు దీర్థ
యాత్రలు పెక్కుపర్యాయములును

తే. రాజరాజేశ్వరీమంత్ర రాజపరమ
పావనోపాసనాత్ముఁడై ప్రాజ్ఞు లెన్నఁ
జేసె నవరాత్రిపూజ లే క్షితిపవినుతుఁ
డట్టి తిప్పర వెంకయ్య నలవె పొగడ.

సీ. ప్రత్యబ్దమున శివరాత్ర్యుత్సవము సేసె
మహితబీరంగూడెమందు భక్తి
నాయూరికొండపై యాత్రికుల్ ముద మొందఁ
ద్రవ్వించె బావి నే ధన్యతముఁడు

వివిధఫలంబులన్ వెలయు వనమ్ములు
దగ నిల్పె నెవ్వాఁడు ధర్మబుద్ధి
నన్నపూర్ణసమాజ మనుసత్రమున్ దీర్చె
నెవఁడు బీదలఁ గావ హితమనీష

తే. యోగసాధనమున మించె నేగుణాఢ్యుఁ
డలఘుగ్రహగణితజ్ఞుఁడై యలరె నెవఁడు
జ్యోతిషంబున నెవఁడు విఖ్యాతి గాంచె
నట్టి తిప్పర వెంకన్న నలవె పొగడ. ౯

క. ఆతిప్పర వెంకన్నయు
శ్రీతరుణిన్ హరి వరించురీతిగ విబుధ
వ్రాతము మెచ్చ వరించెన్
ఖ్యాతాత్మన్ రాజలింగమాంబన్ సుగుణాన్. ౧౦

మ. అల శ్రీతిప్పర వెంకనార్యుఁడు గనెన్ హర్షంబెసంగన్ గుణో
జ్జ్వలసాధ్వీమణి రాజలింగమయెడన్ ప్రాజ్ఞస్తుతాచారపు
త్రుల సద్ధీయుల నల్వురన్ విబుధసంస్తూయాత్మజాసప్తకం
బలఘుప్రాభవమైన లగ్నముల నత్యంతానురాగంబునన్.

తే. తనయులందు ద్వితీయుఁడై దనరినట్టి
టీ. వి. భాస్కరుఁ డెనలేనికీర్తి మెఱసెఁ
బాండవులయందు విజయుఁ డపారసుగుణ
విక్రమాదులఁ జెలఁగిన విధముగాను. ౧౨

ఇట్లు,
కవిశరభ. వెంకటకృష్ణకవి,
పెద్దమందడి.

శ్రీ

## శ్రీయుత టీ వి. భాస్కర్‌గారి యాశీస్సు

# భాస్కర మాలిక.



శా. శ్రీవాణీముఖనిర్జరీరుచిరరోచిస్ఫారశీర్షప్రసూ
నావళ్యంచితభాసమానమృదుపాదాంభోజ; విశ్వేశ్వరీ;
భావాతీతకృపన్ భవత్పదమహాభక్త్యాదులన్ గూర్చుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోహరవధూటీ సత్యవాచార్భటీ.

శా. భావాతీతమనఃప్రభావభరిణా బ్రహ్మాండభాండోదరీ;
లావణ్యాంబుధి; మౌనిలోకనుతలీలాజాల; లోకేశ్వరి
దేవస్తుత్యపదాబ్జ; సత్కృప మహాధీవైభవం బిచ్చుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోహరవధూటీ సత్యవాచార్భటీ.

శా. శ్రీవిజ్ఞానగుణాకరీ మణిమయశ్రీచక్రసంవాసినీ
దేవీ; సజ్జనకల్పవల్లి విలసద్దివ్యాననాంభోరుహా
కైవల్యామితసౌఖ్యదాయి; పరమజ్ఞానంబుఁ జేకూర్చుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోహరవధూటీ సత్యవాచార్భటీ.

శా. భావాభావవిభావినీ; విధిముఖప్రస్తుత్యకీర్త్యాకరీ
భావజ్ఞస్తుతపూతచిత్త; కరుణావారాశి; భూతేశ్వరి

ధీవర్యుల్ మది మెచ్చ సంతతము సద్విద్యాదులన్ గూర్చుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోహరవధూటీ సత్యవాచార్భటీ.

## మ హా ల క్ష్మి.

శా. ప్రావృణ్ణీలపయోదమం దెనయు శంపావల్లి చందాన రా
జీవాక్షామలవక్షమం దెసఁగు నో క్షీరాబ్ధిపుత్రీ; మహా
ధీవర్యుల్ మది మెచ్చ మేటిసిరులన్ దివ్యత్కృపన్ గూర్చుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోహరివధూటీ సత్యవాచార్భటీ.

శా. శ్రీ వేదాంతమహార్థబంధురమనీషివ్రాతసంస్తుత్యశీ
లా; విశ్వేశ్వరి; సర్వలోకజననీ లావణ్యరత్నాకరీ
భావాతీతమహత్వశోభిని; కృపన్ బ్రజ్ఞాయుతున్ జేయుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోహరివధూటీ సత్యవాచార్భటీ.

శా. ఓ వాత్సల్యగుణాంబురాశిబహుళాంహోధ్వాంతనిర్మూలినీ
కైవారంబొనరింతుఁ గేల్మొగిచి సత్కల్యాణముల్ సంపదల్
భావజ్ఞుల్ మది మెచ్చఁ గూర్చుచుఁ గృపా స్వాంతంబు చేనెంత
యున్, టీ. వీ. భాస్కరు నేలు మోహరివధూటీ సత్యవా
చార్భటీ.

శా. దేవేంద్రప్రముఖాష్టదిక్పతుల చే దివ్యస్తుతుల్ గొన్ని యో
కైవల్యామితసౌఖ్యదాయికరుణన్ కావ్యజ్ఞునిన్ చేయుచున్
భావాతీతగుణాళిఁ గూర్చుచును భాస్వత్కీర్తిసంధించుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోహరివధూటీ సత్యవాచార్భటీ.

# మ హా స ర స్వ తి.

శా. దైవజ్ఞప్రకరస్తుతార్యభటసిద్ధాంతాదినానాకలా
ప్రావీణ్యంబున మీఱు భాస్కరువలెన్ భ్రాజన్మహాకీర్తి సు
శ్రీవిజ్ఞానగుణప్రభావములు సుస్థేయంబుగాఁ గూర్చుచున్
టీ. వీ. భాస్కరు నేలు మో విధివధూటీ సత్యవాచార్భటీ.

శా. ఈవిశ్వంబున సర్వతాంత్రికమహాబృందస్తుతామేయమే
ధావిభ్రాజితుఁడైన యార్యభటవిద్వచ్ఛ్రేష్ఠునింబోలె సు
శ్రీవిజ్ఞానగుణంబులాయువుసుకీర్తిన్ గూర్మి చేఁగూర్చుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోవిధివధూటీ సత్యవాచార్భటీ.

శా. ధీవర్గౌఘము సంతసింపఁగమహాసిద్ధాంతముల్ దీర్చుచున్
దేవాచార్యసమాఖ్యసద్బిరుదుచే దీపించులల్లార్యున
ట్లేవేళన్ గృపచే సమస్తసుకలాహృద్యాత్మునిం జేయుచున్
టీ. వీ. భాస్కరు నేలు మోవిధివధూటీ సత్యవాచార్భటీ.

శా. దేవేంద్రప్రతిమానభోగవిలసద్విశ్వంభరాపాలకుల్
సేవింపన్ ఘనగోళశాస్త్రగరిమన్ జెన్నారు బ్రహ్మారువ
ట్లేవేళన్ గృపచే సమస్తసుకలాహృద్యుల్మదిన్ మెచ్చఁగా
టీ.వీ. భాస్కరు నేలు మో విధివధూటీ సత్యవాచార్భటీ.

కవిశరభ వేంకటకృష్ణకవి,

పెద్దమందడి.

శ్రీ

# శ్రీ దేవీత్రయ స్తుతి

# న వ ర త్న ము లు.

---

శా. శ్రీవాణీనుతపాదపద్మయుగళీ ! శ్రీకంఠపత్నీ; యుమా;
దేవీ; శాంకరి; యీశ్వరీ; భగవతీ; ! దివ్యప్రభావోన్నతీ
దేవారాతివిదారిణీ శిశిరపృథ్వీభృత్కుమారీమణీ;
టీ. వీ. భాస్కరపాలినీ మహితచండీ మ్రొక్కెదన్ బ్రోవవే.

శా. నీవే తల్లివి నీవ దేవతవు నీవే ప్రాపటంచున్ సదా
భావంబందున నమ్మియున్నకతనన్ ! బల్మారు సద్భక్తితో
సేవల్ సేయుచునుంటి గాన కృపతోఁ జేపట్టియ శ్రాంతమున్
టీ. వీ. భాస్కరు నేలునట్టులుగ జండీ మ్రొక్కెదన్ బ్రోవవే.

శా. ఈవిశ్వంబునఁ గామితార్థముల నెంతే కూర్మితో నిచ్చుచున్
గైవల్యంబు నొసంగుసాధ్వివని భక్తవ్రాతముల్ వల్క ని
న్నే వేళన్ మదియందునిల్పుకొని నేనింపొంద ధ్యానించితిన్
టీ. వీ. భాస్కరు నేలునట్టులుగఁ జండీ బ్రోవవే సత్కృపన్.

## మ హా ల క్ష్మీ.

శా. శ్రీవైకుంఠపురస్థితీ; భగవతీ క్షీరాబ్ధిసత్పుత్రి రా
జీవద్వేషిసహోదరీ సుగుణరాశీ; లోకమాతా; రమా;
దేవీ; మంగళదాయినీ పరమసాధ్వీ ప్రోల్లసద్రూపిణీ
టీ. వీ. భాస్కరపాలినీ హరివధూటీ భార్గవీ; బ్రోవవే. ౧

శా. శ్రీవైనందునఁ గామితార్థములునిన్ సేవించు భక్తాళికెం
తో వేడ్కన్ దయనేతువంచుమదియందున్ నమ్మినిన్వేడితిన్
దైవారన్ సకలేప్సితార్థములు నిత్యం బిచ్చుచున్ బ్రోవవే
టీ.వీ. భాస్కరపాలినీ హరివధూటీ భార్గవీ మ్రొక్కెదన్.

శా. నీవెవ్వారిని లోకమందునను రాణింపంగ సత్ప్రేమతో వే
బ్రోవన్ జూతువొ వానిమందిరమునన్ బోల్పొందగానుందు
కావే తద్గతిమద్గృహంబునను వేడ్కల్ మీఱభాసిల్లుమా
టీ.వీ. భాస్కరపాలినీ; హరివధూటీ; భార్గవీ మ్రొక్కెదన్.

## మ హా స ర స్వ తి.

శా. శ్రీవాగ్దేవి; సరస్వతీ; భగవతీ శ్వేతాంగి; రోలంబవే
ణీ; వీణాంచితపాణి పావనమతీ నిశ్ఛిద్రవిద్యాఖనీ
దేవారాధితపాదపద్మయుగళీ దివ్యాంబుజాతేక్షణీ
టీ. వీ. భాస్కరపాలినీ; విధివధూటీ మ్రొక్కెదన్ బ్రోవవే.

శా. భావింపన్ ధర నేమహాత్మురసనన్ భాసిల్లెదో యాతఁడే
పో విద్వాంసుఁడనన్ దనర్పును సభాపూజ్యుండనన్ జెల్లున

ట్రీవస్మద్రసనాగ్రసీమను సతంబింపార వర్తింపుమా
టీ. వీ. భాస్కరపాలినీ విధివధూటీ శారదా మ్రొక్కెదన్.

శా. నీ వేనాపయిఁగూర్మిఁ జూపినయెడన్ నిక్కంబుగా సంపదల్
వేవేగన్ బడయంగలన్ ధరణిలో విఖ్యాతి నార్జింతుమే
లౌవిజ్ఞానముగాంతుఁ గావునమదీయాస్యంబునన్ నిల్వుమా
టీ. వీ. భాస్కరపాలినీ; విధివధూటీ శారదా మ్రొక్కెదన్.

కవిసింహ. కాశీపతికవి,

బోదెలవీడు.

# పీ ఠి క.



ఈ వైద్యప్రకాశిక శ్రీయుత టీ. వి. భాస్కర్, బి. యస్. సి., గారిచే రచింపఁబడినది. ఇందు రసాయనశాస్త్రమందలి ముఖ్యమైన ధాతువులయొక్కయు నుపధాతువులయొక్కయు పరిపూర్ణశుద్ధులు వాని పరమాణుభారపరిమితులు, వానికి మిత్రశత్రుసమము లైనట్టియు నధిమిత్రాధిశత్రువు లైనట్టియు ద్రవ్యములను, రసాయనశాస్త్రమందించుకయు పరిచయము లేనివారలకు సయితము విశదముగాఁ దెలియునట్లు వివరింపఁబడినవి.

మఱియు నాయుర్వేదమునందుఁ బ్రచారము గలవృక్షములలోఁ బెక్కువృక్షముల నరువదికంటె నెక్కువ గణములుగ విభజించి యాయాగణములందుఁ బ్రాముఖ్యమైన వృక్షనామధేయముతో గణసంజ్ఞ గావింపఁబడినది. ఈగణవిభాగమువలన ననేకోపయోగంబులు గలవు.

మఱియు చరకాచార్యులవారు తమ చరకమందు వివరించిన యేఁబదికల్పనములకంటె నారుకల్పనము లిందధికముగ నున్నవి. కల్పనమనఁగా నౌషధవిభాగము. ఏవ్యాధికి నిన్ని యౌషధము లుపయోగించు ననుటయే కల్పనశబ్దముయొక్క

ముఖ్యార్థము గాన నీగ్రంథమునందు నెక్కువగా వివరించిన యౌషధకల్పనములవలనఁ బ్రపంచమున కెంత సహాయకార్యములో నిర్ణయించి వ్రాయనక్కరలేదు.

ఇంతియేగాక యాయుర్వేద మనుసరించియు నాంగ్లేయ రసాయనశాస్త్ర మనుసరించియు ధాతువులలో విచిత్ర ధాతువులగు రస, గంధకాదులనుగుఱించి దృష్టాంతదార్ష్టాంత్యములతో విపులముగా పైవానియుపద్రవమునుండి లోకము హానిఁ జెందకుండుటకై మూఁడు గొప్ప వ్యాసము లిందుఁ జేర్పఁబడియున్నవి. ఈగ్రంథకర్త యిట్టి ఘనమైన యాయుర్వేద వైద్యపరిశ్రమచే దేశసేవార్థమై శ్రద్ధతో ననేకమహౌషధంబు లొనర్చియున్నారు. కావున నాయుర్వేదాభిమానులెల్లరు వీరియౌషధములఁ గొని సేవించి యారోగ్యముఁ బడసి వీరియాయుర్వేదవైద్యోద్యమము నభివృద్ధి సేయుదురు గాక.

ఇట్లు,

కవిశరభ వేంకటకృష్ణకవి.

శ్రీ

# వైద్యప్రకాశిక

## 1. పారదము.

ధాతువులలోనెల్ల బారద మొక్కటియే ద్రవరూపముగ నున్నది. ఇది సంయోగస్థితిలో నసంయోగస్థితిలో సహితము లభించును. అసంయోగస్థితిలో బారదపు ఖనులరంధ్రములలో గోళాకారమగు అణువులవలె లభించుచున్నది; సంయోగస్థితిలో పారద మేళనమగు రజతముతోనైనను, గంధకమిశ్రితముతోనైనను దొరకుచున్నది. గంధకమిశ్రితముతో దొరకు పారదమునకు "పారదగంధకిదము" (Mercury-Sulphide) అని పేరు. ఇది గనులలో విశేషముగ జిక్కును. మఱియు స్వచ్ఛమైన పారదము "పారదగంధకిదము" లో నుండియే తీసి అంగడులలో విక్రయించుచున్నారు. అశుద్ధ పారదము మిగుల వేగముగల చలనస్వభావము గలదియు, మినమిన మెరయు కాంతియు గలదియై రజతమువలె దెల్లగ నుండును. దీనియణువులు గోళాకారము. అపరిశుద్ధపారదము కాంతిహీనమై గోళాకారము లేనిదియై పాత్రను స్పర్శించుటయే గాక, ప్రవహించునపుడు సయితము "తోక"తో పాత్రనంటుచు వచ్చును.

ఈపారద మితరధాతువులతో గలియుస్వభావము గలదియగుటచే బారదమును విక్రయించువారు తమలాభమునకై

దానిలో వంగము (Tin) సీసము (Lead) యసదము (Zinc) అను ధాతువుల మిశ్రముచేసి యమ్ముచున్నారు. ఇట్లు మిశ్రితమైన పారదమును వడియబోసి త్రివంగము (Tin, lead and Zinc) లను వేరుచేయవచ్చును. ఎట్లనిన: ఉన్నిబట్టతోనైనను "షామాయి" యను చర్మముతోనైన బారదమును వడియబోసినచో త్రివంగములే గాక ఇతరమాలిన్యములు కొన్ని అనగా ధూళి, మన్ను మొదలగునవి తొలగిపోవును. ఈ త్రివంగములు, ధూళి, మృత్తిక షామాయిచర్మరంధ్రములలోనుండి బయటికి వెడలజాలవు. కావున పైననే యుండును; పారదము మాత్రము క్రిందికి దిగును. కాని యిదియును పరిపూర్ణశుద్ధమైనది కాదు. పారదమును పరిపూర్ణముగ శుద్ధిచేయుట కష్టమె. అయినను దానితోకలిసియుండు నితరధాతువుల నొకించుకయైన లేకుండ సాధ్యమైనంతవరకు శుద్ధిచేయుట యెట్లనగ: పారదమును సజ్జలనత్రికామ్లము (Dilute Nitric Acid)లో నైదారుపర్యాయములు భావనచేయుచు తఱుచుగ గలియబెట్టుచు శుద్ధజలముతో గడిగినయెడల దానియందలి యితరధాతువులన్నియు నత్రికామ్లములో కరిగి శుద్ధపారదమె నిలుచును.

ఇట్టి శుద్ధపారదమును రసయోగములలో వాడుకొనుట సమంజసము.

శుద్ధపారదపుపరీక్షలు:—

1. శుద్ధపారదమును గొంచెము వెచ్చచేసిన. ఉత్పాతము (Sublimation) వలన నిశ్శేషముగ శీతలప్రాంతమున

కెగురును పారదము మలినముతో గలసియున్నప్పుడు ఉత్పాతమువలన నది యెగిరిపోగా మలినము నచట నిలుచును.

2. మరియు శుద్ధమైనపారదమును ప్రవహింపజేసినచో గోళాకారరూపముతో "తోక" వీడక చలించును.

శుద్ధపారదము వాసనలేకయు, రుచిలేకయు, రజతము యొక్క కాంతిగలదియై ద్రవరూపమున నుండును. ఇది యించుమించుగ నీటికంటె పదమూడున్నర (13·5) రెట్లు బరువయినది. ఈపారదము హరినము (Chlorine) తో గాని, అదము (Iodine)తో గాని, గంధకము (Sulphur)తో గాని, స్ఫురము (Phosphorus) తో గాని కలసిన భస్మమగును; అది యితరధాతువులతో గలసిన మేళన (Amalgam) మగుచున్నది. ఈ గుణములనుబట్టి స్వర్ణరజతములను వాని వాని గనులలోనుండి విడదీయుటకు నెక్కువ యుపయోగకర మగుచున్నది.

పారదమువలని యుపయోగములు:—

1. స్వర్ణరజతచూర్ణములతో పారదమున కలిపిన పారదమేళనమైన స్వర్ణము, రజతము ముద్దగట్టును. ఆముద్దను రిటార్టు (Retort) అను యంత్రములో నుంచి వెచ్చచేసినచో బారదము మాత్ర ముత్పాతమువలన స్వర్ణరజతములను వీడిపోవును. శుద్ధస్వర్ణరజతములు మాత్రమే శేషించి యుండును మేళనమైనట్టి పారదమును నయితము వ్యర్థముగ పోనీక గాజు

కుప్పెల (Receivers) వంటి యంత్రములను శీతలప్రదేశము లందుంచి వానిలో పారదమును బ్రోగుచేయుదురు.

2. వంగపారద మేళనము అద్దముల జేయుటయం దుప యోగించుచున్నారు.

3. మఱియు నాపారదమును సర్వసాధారణముగ "ఉష్ణతామాపకములు" (Thermometers) చేయుటయందు.

4. "వాయుభారమాపకములు" (Barometers) చేయుటయందు నుపయోగపడుచున్నది.

పారదము సీమసున్నపు సన్నని చూర్ణముతోను, క్రొవ్వు తైలము మొదలగు పదార్థములతోనైనను బాగుగ గలియ బెట్టినయెడల, చలనస్వభావము వీడి యాయాపదార్థములలో జీర్ణమగును. ఇట్లితరవస్తువులలో జీర్ణించుటయే "పారద మారణమని" యందురు.

పారదగుణములు:—

1. ద్రవరూపకముగనున్న పారదము(ధాతువు)మానవ శరీరమునకు నించుక యుపయోగము సేయదు. ఈవిషయ మును బాగుగ గమనింపవలయును.

2. పారదము భారమైనవస్తు వగుటచే బైకి బోవు ఆంత్రములను నెక్కజాలదు. అది నీటికన్న పదమూడున్నర రెట్లు భారమైనదని యిదివరకే వ్రాసియున్నాము. ఈవిషయ మిట్లుండ కొందరు రసాయనశాస్త్రతత్వ మెరుగని దేశీయ వైద్యులు, సామాన్యప్రజలును పచ్చిపాదరసమును రోగ

నివారణమునకై విశేషముగ వాడుచున్నారు. పచ్చిపారదరస సేవనవిషయమునుగూర్చి కొన్నియంశము లీక్రింద వ్రాయుచున్నాము: పచ్చిపారదమును సేవించిన ఆంత్రములనుండి పైకి పోవుకోలను (Ascending Colon) ద్వారమువరకు దిగి యచట నిలుచునేకాని యచటనుండి పైకిబోవు కోలనుమార్గముగ బైకి నెక్కజాలదు. ఒకవేళ యది మలముచే త్రోయబడుచు ఆమార్గమునుండి వెలుపలకు వచ్చినను ధాతురూపకముగనే యుండుననగా ఆహారము జీర్ణమయినట్లు పారదము జీర్ణము కానేరదని ముఖ్యాశయము.

పారదదుర్గుణములు:—

పారదము సేవనచేతను, పారదమిశ్రితయోగముల సేవనచేతను విపరీతమైనగుణములు సంభవించుచున్నవి. ఎట్లన, నిది రక్తాభిసరణమండలము (Circulatory system) లో జొచ్చి కేశనాళికమండలము (Capillary system) నెల్ల తనశక్తిచే ఉద్రేకపెట్టు. ఇది **ముఖ్యముగ నుమ్మి నూరజేయు గ్రంథులపైన పనిజేయును**. ఈగ్రంథులు జిహ్వాకు నిరుప్రక్కల క్రిందుగ బొదగబడి యున్నవి. ఇవి సాధారణముగ నెల్లప్పుడు నుమ్మి నూరజేయుచుండును. అవకాశము గలిగినప్పుడు మరింత తీవ్రముగ బనిజేయును. అదెట్లనిన మనకు ఇష్టము వచ్చిన భోజనమునే గాని, పదార్థములనే గాని, పులుపువస్తువులనే గాని మదిని దలంచిన మాత్రమున నోట నీరూరుట సహజమే కదా? ఇట్టి సుకుమారమైన గ్రంథులను మిగుల

నుద్రేకపరచుశక్తి పారదమునకున్నట్లు తత్సేవనవలన సంభ
వించెడు ముఖరోగమే ప్రత్యక్షప్రమాణము. కావున నీవిధ
ముగనే శరీరములోనుండెడి యితరావయవములంగూడ కొద్ది
గనో గొప్పగనో యుద్రేకపరచుననుటకు సందియమా ?

మరియు నీపారదము రూపభేదములను జెంది దీపనము (Stimulant) ను గలుగజేయుటయే గాక కొన్ని గుణములను సయితము గలుగజేయుచున్నది. ఒకప్పుడు దీపనము నొకప్పుడు గాఢవిరేచనము (Cathartic) నొకప్పుడు ఋతుప్రదము (Emmenagogue) మొదలగువానిని గలుగజేయును. మరియు నిది చర్మవ్యాధులందు లేపనమువలన లాభమును కలుగజేయు చున్నది. కావున నిది ఆయుర్వేదౌషధములందు సర్వసాధా రణముగ బెక్కుకల్పములలో కలియుచున్నది. ఇట్టి యుపయో గాతిశయముచే నీపారదమునకు విశేషప్రఖ్యాతి కలిగినది.

చిరకాలముగ నీపారదమును సుఖరోగములలోకూడ విశేషముగ వాడుచున్నారు. ఇది నిజముగ సుఖవ్యాధులకు జ్ఞానమయుడైన వైద్యునిచేతి రామబాణమువంటిది. కాని యది యనుభవవిహీనవైద్యునిచేత నున్నచో రోగములనివారణ మొనర్పకపోవుటయే గాక అధిక ప్రమాదముల సయితము సంభవింపజేయుచున్నది. ఈయభిప్రాయమునే ఆయుర్వేదప్రవీ ణులు నుడివియున్నారు. పారదము స్వాభావికముగ దీపనకారి కాన దీనిసేవనవలన దీపనగుణము క్రమముగా స్థాపితమగును. ఇట్లు స్థాపితమైన దీపనము సుఖరోగజనితవైషమ్యమును ప్రతి

ఘటించు(incompatible)ను.అప్పుడా వైషమ్యము నశించును. లేదా మూత్రపురీషములద్వారా బయలువెడలును. ఎవరియభిప్రాయము లెట్లుండినను, పారద మేవిధముగ శరీరముపై పని చేసినను, సుఖరోగములందు ముఖ్యముగ సవాయి (Syphilis) రోగమందు పారదమును కడు జాగ్రతతో వాడిన ఉత్కృష్టమైనఫలములు కలుగుచున్నవి.

పెక్కుసంవత్సరములనుండి నాయనుభవములోనున్న యొకవిషయము నిట వివరించుచున్నాను. అదెద్దియన:— మన మాయుర్వేదమందు వాడుద్రవ్యములలో పారదము ప్రాముఖ్యమైనది. దీనిని ఎంతజాగ్రతగ వాడవలసియున్నదో యంత యజాగ్రతగ పలువురు విద్యావిహీనులు వాడుచున్నందువలన రోగబాధపడువా రొకపాలు, ఇట్టి అజాగ్రతసేవన వల్ల ప్రతికూలించి దుర్గుణములచే బాధపడువారు రెండుపాళ్లుగ గానవచ్చుచున్నారు.

పారదకార్మికులశరీరమున పారదము రెండువిధములుగ జీర్ణమగుచున్నది:—

(1) కార్మికులు చానినంటుటచే శరీరసూక్ష్మరంధ్రములనుండి లోపలికి పోవుటవలనను, (2) ఆవిరి రూపకమైన పారదమును పీల్చుటవలనను, ఇట్లు శరీరములో రెండువిధంబుల జీర్ణమగుచున్నది.

కార్మికుల కీవిధముగ జీర్ణించిన పారదము అనేక ప్రమాదవ్యాధులను గలిగించినట్లు పెక్కునిదర్శనములుగలవు.

ఈపారదము చాలవరకు నాడీమండలము(Nervous-System) ను దుర్బలము జేయుచున్నది. నాడీమండలదుర్బలలక్షణము లెవ్వియనిన:— వేపథు (వణుకు = Shaking Palsy) మత్త తలత్రిప్పుడు (Vertigo) జ్ఞాపకశక్తిహీనము (Loss of Memory) మస్తిష్కరోగము (Cerebral disorders) మొదలగునవి. వీని పర్యవసానము మోక్షమే. ఇట్టిగుణములు గనబడినతోడనే యావ్యాధిగ్రస్తులు చికిత్సలు సలిపి పారదకర్మను చాలించుట మేలు. అట్లు నేయ రేని మరికొన్ని అపాయకరమైన వ్యాధులు ప్రత్యక్షమగును. అవి యెవ్వియనిన:—(1) సంధిదోషము (Delirium), (2) అపస్మారము (Epilepsy), (3) సన్యాసరోగము (రుద్రవాతము = Apoplexy) మొదలయిన దుష్టవ్యాధులు. ఇవి మారక హేతువులనుట తప్పదు. పారదకర్మమువలన ప్రాణహాని యగుననుతలంపుతో పారదకర్మ మొనర్చిన పాపము సంభవించునని మతసంబంధమైన ధర్మమును కల్పించియున్నారు. మరియు హేమక్రియకు (ఖిమియా) బ్రాముఖ్యమైనవస్తువు పారదమనియు, దానితో గృహముల యందు పుటములు మొదలగునవి చేసినచో ఆయాగృహముల యందే గాక తత్ప్రాంతములలో నుండుజనులకు సయితము పారదమువలన ప్రాణహానికలుగునను నుద్దేశ్యముతో గృహములందు హేమక్రియను నిషేధించవలయునను నభిప్రాయముతో హేమక్రియవలన గలిగినపాపముతో వంశము నాశనమగునను కల్పనము గావించి దానిని మతధర్మములలో

నిషేధించియున్నారని పలువురి యభిప్రాయము. ఏది యెట్లుండి నను రసతత్వమును నెరుంగుట యావశ్యకమైన యంశము.

ఈ దిగువ మరికొన్ని పారదదుర్గుణములు వ్రాయు చున్నాము. పారదభస్మములు, పారదలవణములు, పారదసిం దూరము మొదలగునవి యనేకవిధములచే జేయబడును. అందు గంధకమిశ్రితమయినయోగములే కించిత్తు హానికరము లైనవి. మిగతవి మిగుల హానిజేయునవి. ఇదివరకు నాడీమండ లమునకు గలుగజేయు ప్రమాదములను వ్రాసియున్నాము. ఇక శ్వాసమండలమునకు, జీర్ణకోశమునకును జేయు లాభనష్ట ములను వివరించుచున్నాము:— (1) పారదము ఉచ్ఛ్వాస నిశ్వాసోపకరణములగు నూపిరితిత్తులను ద్రవింపజేయును. (2) మరియు నిది యాంత్రముల(ప్రేగుల)లోని యామరాశి,పైత్య రసము (Bile), లాలాజలము (ఉమ్మినీరు=Saliva), నోటనుండు శ్లేష్మము,మధురరసము (Pancreatic juice) ఆరోగ్యస్థితికి నవ సరము. వీనిని లోపింపజేయుటయే గాక ఊపిరితిత్తులను, మూత్రనాళమును, కనురెప్పలను నేత్రములను కప్పియుండు పొరను (Conjuctival membrane) నెమ్మెక్క జేయును. మూ త్రము నధికముగ స్రవింపజేయును. స్త్రీలకు ఋతుస్రావ మధిక మొనర్చును. చర్మమును తేమగను నుష్ణముగను జేయును. కావున పారదము సర్వేంద్రియములందు, సర్వావ యవములందు, సర్వకోశములందు వ్యాపించుచున్నదని పై యంశములవలన తెల్లంబగుచున్నది.

రససేవనవలన గలుగుచిహ్నములు:—

సాధారణముగ గ్రంథులు వాచును. ఆగ్రంథులు గట్టిపడి, పైకుబికి గానవచ్చును. లాలాగ్రంథులందును, నోట నుండు శ్లేష్మపుకుదుళ్ల (Mucous follicles) యందును దీని గుణ మెక్కువగ గనిపించును. నోరు చెడి ద్రవించును. దానిని సేవింపగనే మొదట చిగుళ్లువాచి నొప్పిగా నుండును. చిగుళ్లు రోజాపుష్పవర్ణముగ మారును. దంతములనంటియుండు చిగుళ్లయంచు లెఱ్ఱనై యుండును. వరుసగా నోరంతయు చెడి నాలుక వాచును. జిహ్వా తామ్రపుచిలుము రుచిగ నుండును. ఉచ్ఛ్వాసము దుర్గంధము గలదియై యుండును. చివరకు ఉమ్మి నూరజేయుగ్రంథులు సహితము వాచి నోటనుండి ఉమ్మి, శ్లేష్మము స్రవించుచుండును. ఒక్కొక్కతరి సేర్లకొలది యుమ్మి స్రవించును. ఇట్టిస్థితిలోనుండు వ్యక్తికి తగు మంచియాహార మిడనిచో శరీరముననుండు క్రొవ్వు కరిగి శరీరము క్షీణించును. ఈగుణములు శరీరప్రకృతి ననుసరించియు సేవించిన యౌషధమునుబట్టి యుండును.

కొన్నిరసౌషధములు నొక్కొక్కసందర్భమున జాఠరరస మూరజేసెడిగ్రంథుల నుద్రేకింపజేయుచున్నవి. అప్పుడు నోరు మంటయు నొప్పియు గలిగియుండును. నాలుక రుధిరరుచి కలిగి యుండును. గొంతు బిగిసికొనియున్నట్లుండుటయే గాక మంట గలిగియుండును. మొగము రక్తము గ్రమ్మియుండును. ఒకానొకప్పుడు మొగము వాచియుండును. వమనము విరేచనము సయితమగుచుండును. తరచుగ రక్తవమనవిరేచనములు సంప్రాప్తమగుచుండును. ఎట్టిపదార్థములు భక్షించినను వమనము

లధికమగుచుండును. మరియు మూత్రనాళములో మంటయు మూత్రకృచ్ఛ్రము, నాడీబలహీన మగును, రక్తప్రవాహము తగ్గును, నాడి యతివేగముగ నుండును. ఉచ్ఛ్వాసనిశ్వాససంకటము హెచ్చును. కాళ్లుజేతులు శీతలముగ నుండును. లాల మధికముగ స్రవించును. తుదకు పరలోకము ఘటించును.

పారదము శరీరములో రెండువిధములుగ యిముకు నని యిదివరకే వ్రాసియున్నాము గదా! అట్లు యిమికినపారద మెుకప్పుడు బహిష్కార్యమండలము (Excretory organs) నుండి వెలుపలికి నెట్టివేయబడుచున్నది. ఇట్లు నెట్టివేయబడిన పారదము రక్తములో, స్వేదములో, ఉమ్మినీరులో, పైత్య రసములో, మూత్రములో గనబడుచున్నది. మరియు నొక ప్పుడు శరీరములో ధాతురూపకముగ నిలిచియుండును. నిలువ బడిన యాపారదము అస్థులలోను, మెదడులోను, కాలేయము (liver) నూపిరితిత్తులలోను, కణమల ధాతుపదార్థములోను (Cellular-tissue) గనబడుచున్నది.

ధాతురూపముగా నున్న పారదమువలన ప్రయోజ నములేదని పూర్వమే వ్రాసియున్నాము. ఇది జీర్ణము కానేరదు. క్రిందికి నాటంకము లేకయె దిగునుకాని పైకి నెక్క జాలనిహేతువుచే పైకిపోవు కొలనుద్వారముదగ్గరకు వచ్చి యచటనే యది భస్మమై యామ్లజనిదము (Oxide)గా మారు చుండును నుండును. ఆమ్లజనీకరణ మాకొలది (Oxidation)లవణ ముగ మారి, జీర్ణించి, అనేకవికారములను బుట్టించు. కనుక వైద్యులు వైద్యేతరులు ధాతురూపకముగా నున్న పారద

మును వాడుట, సేవించుట నిష్ప్రయోజనమని, భవిష్యత్కాలమునకు అనేకయుపాధులకు కారణభూతమని నమ్మి దీనిసేవనను మానుకొనుట సమంజసము.

దీర్ఘరోగములలో చిన్నచిన్న రసౌషధమాత్ర లుపయోగించుచున్నారు. వీనినే దోషఘ్నము (Alteratives) లనియందురు. అగ్నిమాంద్యము (Dyspepsia), వాతరక్తము (Gout), చర్మవ్యాధులు, గండమాలలు (Scrofula) మొదలగువ్యాధులలో రసభస్మము (Calomel) నకంటె "పారదమారణము" నెక్కువ యారోగ్యము జేయుచున్నది. ఏలయన రసభస్మము జీర్ణమండలమున, ప్రేగులలోను తీవ్రముగ పని జేయుచున్నది, కావున శరీరప్రకృతిని ఆరోగ్యస్థితికి మార్చుటకు రసభస్మమంత శక్తిగల దోషఘ్నములు వాడుట యనవసరము. "పారదమారణము" రసభస్మమువలె తీవ్రత లేక శాంతముగ శరీరప్రకృతిని యారోగ్యముగ మార్చును. అది పసిబిడ్డలకు సయితము విశేషముగ మేలుజేయును.

**సూచన:** పాదరసప్రయోగము కొందరు అజ్ఞానముచే అనుచితముగ వాడుచు ప్రమాదములు కలిగించుచున్న యంశము క్రొత్తది కాదు. కావున దాని సుగుణదుర్గుణములను సూచింపజేయుచు అది ప్రత్యవయవముపై పనిజేయు విధానములను క్లుప్తముగ వ్రాసియున్నాను. ఇతరాంశములను చికిత్సాగ్రంథములందు జూడనగును.

---

శ్రీ

# వైద్యప్రకాశిక.

## 2. పదార్థవిజ్ఞానము.

---

ప్రపంచములో నిప్పటివఱకు గనుగొనిన మూలద్రవ్యము లెనుబదికంటె నెక్కువగా నున్నవి. కాని మన యాయుర్వేదములో జిరకాలమునుండి వాడుచున్న కొన్నిద్రవ్యములలోనుండు మూలపదార్థముల గొన్నిటిని మాత్ర మీ క్రిందిపట్టికయందు వివరించుచున్నాము.

ప్రపంచములోని మూలద్రవ్యములన్నియు (Elements) రెండువిధములుగా విభజింప బడియున్నవి. అందొకటి ధాతువు (Metal), రెండవది యుపధాతువు (Non-metal). ఈ రెండుధాతువులలో నొక్కొక్కటి ఘనరూప (Solid)ముగను, ద్రవరూపముగను (liquid), వాయు (gas) రూపముగ నిట్లు మూడురూపములతో నుండును. వీటిలో రెండు మూలపదార్థములు విచిత్రములైనవి. అందొకటి పారదము. ఇది ధాతువై ద్రవరూపముగా నున్నది. రెండవది తాలము (Arsenic) ఇది భౌతికవికారము లన్నిటియందు ధాతువువలెనుండియు రసాయనవికారములన్నిట నుపధాతువువలె నుండును. హేమక్రియావాదు లీరెండిటికి నెక్కువప్రాముఖ్యత నిచ్చియున్నారు.

ఈవ్యాసమునం దుపయోగించు ప్రతిద్రవ్యమునకు సౌకర్యార్థమై యాంగ్లేయనామమును మఱియు నది ధాతువైనదియు నుపధాతువైనదియు, ఘన, ద్రవ, వాయురూపమైనదియు, వానివాని పరమాణుభారము దెలుపఁబడును.

## అణువులు - పరమాణువులు.

ప్రపంచమునంగల జడాజడాత్మకములైన సర్వవస్తువులనేకములైన యణువులచే గూర్పబడి యున్నవి. ఆ యణువులు మిగుల చిన్నవియగుటచే దృష్టికి గానుపింపవు. ప్రతి చిన్నవస్తువునందునైత మణువు లపరిమితముగా నున్నవి. ప్రతి యణువు సాధ్యమైనంతవఱకు విభజించుటకు దగియుండునని భౌతికశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఇ ట్లణువులనుండి విభాగింపబడుచు వచ్చినయణువులనే పరమాణువులని యందురు. మూల ద్రవ్యములుకూడ పదార్థములె కావున వానియందనేకాణువులుండుననుటకు సందియము లేదు.

మూలద్రవ్యములలో నన్నిటియందు నుదజని (Hydrogen) యనువాయువు బహు లఘువైనది. ఇది గాలికంటె (14·5) పదునాల్గున్నరరెట్లు లఘువైనది. ఇది మిగుల తేలికయైన వాయువగుటచే దీని ననుసరించి యితరపదార్థముల పరమాణుభారతారతమ్యత నిర్ణయింపబడినది. ఈ యుదజని వాయు వన్నివాయువులకంటె చాలా తేలికగలదనుటచే దానితారతమ్యగరిమను నొకటిగా నిర్ణయింపబడెను. ఈవిధ

ముగ నీయుదజని ననుసరించి సమస్తపదార్థముల తారతమ్య గరిమ కనిపెట్టిరి. ఆ తారతమ్యగరిమకే పరమాణుభార మను చున్నారు. అనగా నుదజనికంటె ప్రతిమూలద్రవ్య మిన్ని భాగము లెక్కువ భారముగా నున్నదనుటయె ఆయాద్రవ్య ముల పరమాణుభారమని తెల్లమగుచున్నది. ఉదజనికంటె వేరొక మూలద్రవ్య మిన్నిభాగము లధికముగ బరువున్న సంగతి నెఱుంగువిధ మెట్లన నొకచిన్న పాత్ర నిండనింపిన ఉదజని యొకతులమెత్తున్న దనుకొందము. అదే పాత్రయందు నామ్లజనిని నింపి తూచినచో 16 తులముల భారమగును. అదే పాత్రనిండ నత్రజని (Nitrogen) ని, హరినము (Chlorine) ను నింపి తూచిన నుదజనికంటె నత్రజని పదునాల్గుభాగములు హరినము ముప్పదైదుభాగములనరభారము తూగును. దీని వలన దేలినసారాంశ మేమన నుదజనికంటె నామ్లజని 16 భాగములు నత్రజని 14 భాగములు హరినము 35·5 భాగము లెక్కువ బరువుగానున్నవని స్పష్టపడినది. ఈవిధముగనె పదార్థ శాస్త్రపారంగతు లితరమూలపదార్థముల పరమాణుభారము నుదజనిసాయమున సాధించియున్నారు. ఈవ్యాసము పట్టిక యం దుదహరించిన భారములవలన నేయే పదార్థ మెంతెంత భార ముండునను నంశమును వాటియంతరము విస్పష్టమగు చున్నవి.

| సంఖ్య | మూలద్రవ్యములు. | ఇంగ్లీషు పేరు. | ధాతువు లేక ఉపధాతువు | ఘన, ద్రవ, వాయు రూపము. | పరమాణు భారము ఉదజని=1 |
|---|---|---|---|---|---|
| 1 | స్ఫటము | అలుమినియం | ధా | ఘ | 27 |
| 2 | తాలము * | ఆర్సెనిక్ | ఉ | ఘ | 75 |
| 3 | టంకము | బోరక్స్ | ఉ | ఘ | 11 |
| 4 | హరినము | క్లోరీన్ | ఉ | వా | 35.5 |
| 5 | ఖటికము | కాల్సియం | ధా | ఘ | 40 |
| 6 | కర్బనము | కార్బన్ | ఉ | ఘ | 12 |
| 7 | తామ్రము | కాపర్ | ధా | ఘ | 63.5 |
| 8 | లోహము | ఫెర్రం | ధా | ఘ | 56 |
| 9 | ఉదజని | హైడ్రోజిన్ | ఉ | వా | 1 |
| 10 | పారదము * | మెర్క్యురి | ధా | ద్ర | 200 |
| 11 | పొటాసియం | పొటాసియం | ధా | ఘ | 39 |
| 12 | నత్రజని | నైట్రోజిన్ | ఉ | వా | 14 |
| 13 | సోడియం | సోడియం | ధా | ఘ | 23 |
| 14 | అమ్లజని | ఆక్సిజన్ | ఉ | వా | 16 |
| 15 | సీసము=నాగము | లెడ్ | ధా | ఘ | 207 |
| 16 | స్ఫురము=భాస్వరము | ఫాస్ఫరస్ | ఉ | ఘ | 31 |
| 17 | గంధకము | సల్ఫర్ | ఉ | ఘ | 32 |
| 18 | వంగము, తగరము | టిన్ | ధా | ఘ | 118 |
| 19 | యసదము=తుత్తునాగము | జింక్ | ధా | ఘ | 65 |
| 20 | రజతము | సిల్వర్ | ధా | ఘ | 108 |
| 21 | స్వర్ణము | గోల్డ్ | ధా | ఘ | 197 |

* వీని విపరీతగుణము లిదివరకే దెలిపియున్నాము.

**1.** గాలి:—

గాలిలో ననేకములైనవాయువు లున్నవి. ముఖ్యముగ అమ్లజని, నత్రజని, యీ రెండు వాయువులు విశేషముగ నున్నవి. ఈరెండిటితో సహా బొగ్గుపులుసువాయువు (Carbon Dioxide) నీటియావిరి, పొగ మొదలైన వనేకవాయువులు కూడ నున్నవి కాని యివి బహుస్వల్పముగ నున్నందువలన లెక్కింపలేదు.

| | | |
|---|---|---|
| అమ్లజని | ... | 1 భాగము |
| నత్రజని | ... | 4 భాగములు |

వాయుమండలమంతయు నీరెండు వాయువులచే నావరింపబడి యున్నది.

**2.** నీరు:—

నీటిలోను గాలిలోనున్నట్లు అనేకద్రవ్యములు కలిసి యున్నవి. సముద్రజలములో లవణము కలిసియున్నది. తటాకములు, చెరువులు మొదలగువానిలో ఖటికము, బురద, మట్టి మొదలగు ననేకమలినములు, ఇతరపదార్థములు కలిసి యున్నవి వర్షోదకము, ఊటనీరు శుద్ధమైనవి. ఇట్టి శుద్ధోదకములో రెండు మూలద్రవ్యము లగువాయువు లున్నవి. ఒక నీటియణువును విభాగించి చూచిన మన కీరెండు వాయువు లున్నట్లు తెలియవచ్చుచున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| 2 | ప. అ. | ఉదజని | ... | 2 ప. అ. భా. |
| 1. | ,, | అమ్లజని | ... | 16 ,, |

అనఁగా రెండుపరమాణువుల యుదజని యొకపరమాణువు అమ్లజని ఉన్నవి. మొత్తము మూడుపరమాణువులు. ఉదజని యొక్కపరమాణు భారమొకటని యిదివరకె వ్రాసియుంటిమి కనుక రెండుపరమాణువుల భారము రెండుగను, అమ్లజని పరమాణుభారము 16 రని యిదివరకె చెప్పియుంటిమి. వీని భారములన్నియు గూడ పట్టికలో వ్రాసియున్నాము. ఒక యణువు జలము 18 పరమాణువులభారమని తెలియవచ్చు చున్నది. నూరుతులముల నీరులో 88·864 తులముల అమ్ల జనియును 11·136 తులముల యుదజని యున్నదని రసాయన శాస్త్రవేత్తలు కనిపెట్టి నిర్ణయించియున్నారు.

**3.** హైడ్రోక్లోరిక్ ఆసిడ్ = ఉదజహారికామ్లము:—

ఇది యొకవిధమైన ద్రావకము. ఇందులో రెండు వాయువులైన మూలద్రవ్యములు గలవు.

1. ప. అ. ఉదజని ... 1 ప. అ. భా.
1. ,, హారినము ... 35.5 ,,

ఒక్కయణువు ఈపదార్థములో నొక్కపరమాణు వుదజని, ఒక్కపరమాణువు హారినము గలవు. వానివాని పరమాణు భారము కూడ కనపర్చియే యున్నది. వానిమొత్తము 36.5 అనగా ముప్పదియారున్నరతులముల యుదజహారికామ్లమును తీసుకొన్న దానిలో నొకతులము ఉదజనివాయువు ముప్ప దైదున్నరతులముల హారినముండునని తెలిసికొనవలయును. ఈవిధముగనే యన్నిద్రవ్యములలోనున్న మూలద్రవ్యము లను వానివానిపరిమితియు తెలియవచ్చుచున్నది.

**4.** నైట్రికు ఆసిడ్ = నత్రికామ్లము:—

దీనిని షోరాతేజాపని వ్యవహరింతురు. దీనిలో వాయు త్రయమూలద్రవ్యములు గలవు. ఒకఅణువు పదార్థములో

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | ఉదజని | ... | 1 | ప అ. భా. |
| 1. | ,, | నత్రజని | ... | 14 | ,, |
| 3. | ,, | అమ్లజని | ... | 48 | ,, |

ఈప్రకారముగ నున్నవి. పై నెం॥ 2,3 లో దెలియజేసినప్రకారము దీనిలో గూడ యదేవిధముగ పరమాణువులు, మూల పదార్థములు, పరమాణుభారములు గలవని యెరుంగవలయును.

**5.** సల్ఫ్యూరిక్ ఆసిడ్ = గంధకికామ్లము:—

దీనిని గంధకతేజాపని వ్యవహరింతురు. దీనిలో మూడు మూలద్రవ్యములు గలవు. ఒక అణువు పదార్థములో

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2. | ప. అ. | ఉదజని | ... | 2 | ప. అ. భా. |
| 1. | ,, | గంధకము | ... | 32 | ,, |
| 4. | ,, | అమ్లజని | ... | 64 | ,, |

**6.** పటికి, తువరి = ఆలం:—

ఇది రెండుపదార్థముల సంయోగముచే నైన వస్తువు (1) పొటాసియం సల్ఫేట్ (2) అలుమినియా సల్ఫేట్. ఈ రెంటిలోను నాల్గుమూలద్రవ్యము లున్నవి.

(1) పొటాసియం సల్ఫేట్ లో:—

| | | | | |
|---|---|---|---|---|
| 2. ప. అ. | పొటాసియం | ... | 78 ప. అ. భా. | } |
| 1. ,, | గంధకము | ... | 32 ,, | |
| 4 ,, | అమ్లజని | ... | 64 ,, | |

(2) అలుమినియం సల్ఫేట్ లో:—

| | | | |
|---|---|---|---|
| 2. ప. అ. | స్ఫుటము | ... | 54 ప. అ. భా. |
| 3. ,, | గంధకము | ... | 96 ,, |
| 12. ,, | అమ్లజని | ... | 192 ,, |

పటికిలో 24 పాళ్లు నీరు కలిసియున్నందున స్ఫటికీకరణమై (Crystal) యున్నది. దీనిని ప్రేల్చినచో దీనిలోనుండు నీరావిరిరూపమున బోయి యాపటికి బత్తిసాలవలె పొంగియుండును. మరియు నది యంచులుగల తన (స్ఫటిక = Crystal) యాకారమును రూపమును వదలి భిన్నరూపము చేత చూర్ణమై (amorphous) నిలుచును. ఇట్టి చూర్ణమును నీటిలో కరిగించినచో దాని పూర్వరూపము గనబడును.

**7.** అమ్మోనియా:—

అమ్మోనియా యన తడిసున్నములో నవసాగరమును జేర్చి రాచినతోడనే వెడలు గాటమగువాయువు. దీనిలో రెండు మూలపదార్థములైన రెండువాయువులు గలవు. ఒక యణువు అమోనియాలో

| | | | | |
|---|---|---|---|---|
| 1. ప. అ. | నత్రజని | ... | 14 | ప. అ. భా. |
| 3. ,, | ఉదజని | ... | 3 | ,, |

ఈ అమోనియా తడిసున్నముతో నవసాగరము జేర్చినంత మాత్రమున జనించువాయు వెళ్లైనదియో వివరించు చున్నాము. నవసాగరమునకు పచ్చిసున్నపు సంఘర్షణము గలిగినంతనే యానవసాగరమం దిమిడియున్న అమ్మోనియా వేరగుటకు గారణ మేమనిన: వివిధమైనవ్యక్తులకు బరస్పరానురాగము మిత్రత్వము, అతిమిత్రత్వము, శత్రుత్వము, అతిశత్రుత్వము, సమత్వ ముండును. అవి తమతమ మిత్రసమాగమము లభించిన వానిని గలిసియుండును. అట్లుండ నొకప్పు డతిమిత్రసమాగమము సిద్ధించినచో మిత్రుని వీడి అతిమిత్రుని గూడును. వ్యక్తులవలెనె వస్తువులకు సయితము పరస్పరానురాగమిత్రాతిమిత్రాదు లుండును. వీనికి అతిమిత్రసంబంధము గలిగినచో మిత్రసంబంధము వీడి అతిమిత్రముతో గూడుకొనును. నవాసాగరమందున్న యమోనియా, హారినము ద్రవ్యములలో హారినమునకును, తడిసున్నమునందున్న ఖటికము, అమ్లజని యను రెండుద్రవ్యములలో ఖటికమునకు నతిమిత్రత్వ ముండుటచే, నవసాగరమునకు తడిసున్నపుసంఘర్షణము గలుగగా యానవసాగరాంతర్గత హారినమునకు బరమమిత్రమైన ఖటికపుసంబంధము గలుగుటచే పూర్వమిత్రమైన అమోనియా సంబంధము వదలి ఖటికముతో గలిసి ఖటికహారిద మను మరొకపదార్థ మయ్యెను. ఈయంశము ఈక్రింది సమీకరణమువలన మఱింత స్పష్టమగును. 2 అణువుల నవసాగరమును 1 అణువు తడిసున్నముతో సంఘర్షణము గావించినచో:—



$$2\ NH_4\ Cl + Ca\ H_2O_2 = Ca\ Cl_2 + 2NH_3 + 2H_2O.$$

రెండణువుల నవసాగరములోనుండు రెండు పరమాణువుల హారినము నొకపరమాణుఖటికముతో గూడి నొకయణువు ఖటికహారిదము (Calcium chloride) అగును. ఇక నవసాగరములో శేషించినవి రెండు నత్రజనిపరమాణువులు పది యుదజనిపరమాణువులు. ఈశేషములోని రెండు నత్రజని పరమాణువు లారుదజనిపరమాణువులు గలిసి రెండణువుల యమోనియా యగును. మిగత నాల్గుపరమాణువుల యుదజనితో ఖటికామ్లము (Calcium Oxide) లో నున్న రెండు పరమాణు వామ్లజని కలిసి రెండణువుల నీరగును. (నెం. 2 చూడుడు.) నవసాగరము తడిసున్నమున జేరినచో దానినుండి (1) ఖటికహారిదము, (2) అమోనియా, (3) జలము అను మూడువస్తువులు సంభవించుచున్నవి. ఖటికహారిదము ఘనపదార్థ మగుటచే జలముతో గలిసి యడుగున నిలుచును. అమోనియా వాయురూపమగుటచే పైకెగసి వాయుమండలము జేరును.

**8.** నవసాగరము (సాల్ అమ్మోనియక్):—

దీనికే చూళికాలవణమని గ్రంథములందు నామము గలదు. దీనిలో మూడు వాయురూపకములైన మూలద్రవ్యములు గలిసియున్నవి. దీని యణుపదార్థములో

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ప. అ. | నత్రజని | ... | 14 ప. అ. భా. |
| 4. | ,, | ఉదజని | ... | 4 ,, |
| 1. | ,, | హారినము | ... | 35.5 ,, |

దీనికి అగ్నిసంబంధమువలన ఉత్పాతము ఘటించును. ఉత్పాతము జెందిన యీ నవసాగరమును శీతలప్రదేశమందు గూడబెట్టవచ్చును. ఇట్లు కూడబెట్టబడిన నవసాగరమునకే నవసాగరపతంగమని పేరు. పతంగమనగా నెగురుట.

**9.** ద్రవరాజము. (అక్వారీజియా):—

ఇది మూడుభాగముల ఉదజహరికామ్లము నొకభాగము నత్రికామ్లము చేరిన యగును. పైనుదహరించిన ఉదజహరికామ్లము, నత్రికామ్లము, గంధకికామ్లమను మూడామ్లములచే కరగని స్వర్ణము, ప్లాటినము సయితము ఈద్రవరాజముచే కరుగును. ఈకారణముచేతనే దీనికి ద్రవరాజమని పేరు పెట్టబడినది. దీనివిషయములు నెం॥లు 3, 4 చూచిన సర్వము విశదమగును.

**10.** తాలకుటుంబము:—

అ. మనశ్శిల = (రియాల్ గర్)

దీనియందు రెండుపథాతువులు జేరియున్నవి. ఒకయణువు మనశ్శిలలో

| | | | | |
|---|---|---|---|---|
| 2. | ప. అ. | తాలము | ... | 150 ప.అ.భా. |
| 2. | ,, | గంధకము | ... | 64 ,, |

ఆ. తాళకము = (ఆర్పిమెంట్)

దీనిలో సయితము మనశ్శిలలో నుండెడు మూలద్రవ్యములే చేరియున్నవి కాని గంధకాంశ మధికముగ నున్నందు

వలన నామ, రూపగుణము భేదము లున్నవి. అణువు తాళక ములో

| | | | | |
|---|---|---|---|---|
| 2. | ప. అ. | తాలము | ... | 150 ప. అ. భా. |
| 3. | ,, | గంధకము | ... | 96 ,, |

ఇ. హారిదళము = (యెల్లో ఆర్పిమెంటు)
ఈపదార్థము సయితము మనశ్శిలతాళకములో చేరినట్టిదే. దీనిలో నంతర్గతమయినవస్తువులు మనశ్శిలతాళకములలో నుండునవియె.

| | | | | |
|---|---|---|---|---|
| 2. | ప. అ. | తాలము | ... | 150 ప. అ. భా. |
| 5. | ,, | గంధకము | ... | 160 ,, |

**11.** శంఖపాషాణము = (వైట్ ఆర్సెనిక్):—
అను నీవస్తువుకూడ తాలకుటుంబములో చేరియున్నను నిందు గంధకము లేదు. ఇది ఆమ్లజనితో గలిసియున్నది. దీనియొక్క యణువులో

| | | | | |
|---|---|---|---|---|
| 4. | ప. అ. | తాలము | ... | 300 ప. అ. భా. |
| 6. | ,, | ఆమ్లజని | ... | 96 ,, |

ఈశంఖపాషాణము స్ఫటికీకరణమైన యద్దపు (Transparent) ముక్కవలె నుండును. దీనిని చాలకాలము గాలిలో నుంచి నచో అద్దపురూపము మారి చీని (enamel=opaque) దాని రీతిగ గనబడును. అగ్నిచే నిది కూడ యెగిసిపోవును. నవసాగరపతంగమువలెనే దీనిపతంగమును కూర్పవచ్చును.

**12**. సీమసున్నము = (చాక్):—

దీనిలో మూడు మూలద్రవ్యము లున్నవి. అందొకటి ధాతువు. రెండవది యుపధాతువు. మూడవది వాయువు. ఒక సీమసున్నపుటణువులో

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ప. అ. | ఖటికము | ... | 40 ప. అ. భా. |
| 1. | ,, | కర్బనము | ... | 12 ,, |
| 3. | ,, | అమ్లజని | ... | 48 ,, |

సీమసున్నములోనుండు మూలద్రవ్యము లదేపరిమాణముతో నత్తగుల్లలలోను, ముత్యపుచిప్పలలోను, ముత్యములలోను, పగడములలోను, సున్నపురాళ్లలోను, గ్రుడ్లపొచ్చెలలోను నున్నవి. కావున నివన్నియు రూపభేదములతో నుండుటయే గాని రసాయనగుణములందు భేద మించుకయు లేదు.

**13.** తడిసున్నము = ఖటికోదజామ్లజనిదము:—

సున్నపురాళ్లను నెఱ్ఱగా గాల్చిన పొడిసున్నమగున నియు పొడిసున్నమున నీరుబోసిన తడిసున్నమగుననియు నంద ఱెరంగినయంశమే సున్నపురాళ్లవలెనే ముత్యపుచిప్పలు, ముత్యములు, పగడములు, గవ్వలు, మొదలగునవి యెఱ్ఱనగు వరకు గాల్చినచో పొడిసున్న మగుచున్నవి. ఇట్టి ముత్యపు చిప్పలసున్నమునకే శుక్తిభస్మమనియు, ముత్యములసున్నము నకు మౌక్తికభస్మమనియు, పగడములసున్నమునకు ప్రవాళ భస్మమనియు, గవ్వలసున్నమునకు వరాటభస్మమనియు చెప్పుట

గలదు. వీనినన్నిటిలో యవే మూలద్రవ్యములు సంఘట్టనమై యున్నవి. వైశుక్త్యాదులను దహించినప్పుడుగాని భస్మమొనర్చినప్పుడుగాని గలుగుచున్న పృథక్కరణమే మనవానిలో నుండు కర్బనము కొంత అమ్లజనిని స్వీకరించి మూలపదార్థమును వీడును. ఇది యీ క్రింది సమీకరణమువలన మరింత స్పష్టపడుచున్నది.

ఖటికకర్బనితము = ఖటికామ్లజనిదము + కర్బనద్వ్యామ్లజనిదము.

| | | | | |
|---|---|---|---|---|
| ఖటికము 1 ప.అ. | | ఖటికము 1 ప. అ. | | కర్బనము 1 ప. అ. |
| కర్బనము 1 ,, | = | అమ్లజని 1 ,, | + | అమ్లజని 2 ,, |
| అమ్లజని 3 ,, | | | | |

కర్బనద్వ్యామ్లజనిదమునే బొగ్గుపులుసువాయు వందురు. ఇది వాయురూపముగ నున్నందున వాయుమండలములో జేరును. శుద్ధఖటికామ్లజనిదము లేక పొడిసున్నము శేషించి యుండును. దీనిలో నీరు జేర్చిన దడిసున్నమగు. ఇది యీ సమీకరణమువలన స్పష్టమగును.

పొడిసున్నము + నీరు = తడిసున్నము.

| | | | | |
|---|---|---|---|---|
| ఖటికము 1 ప. అ. | + | ఉదజని 2 ప. అ. | = | ఖటికము 1 ప. అ. |
| అమ్లజని 1 ,, | | అమ్లజని 1 ,, | | ఉదజని 2 ,, |
| | | | | అమ్లజని 2 ,, |

కనుక తడిసున్నములో మూడు మూలద్రవ్యము లున్నవి. ఒకయణువు తడిసున్నములో

1. ప. అ. ఖటికము ... 40 ప. అ. భా.
2. ,, ఉదజని ... 2 ,,
2. ,, అమ్లజని ... 32 ,,

**14**. (అ) రసకర్పూరము = పారదహారిదము, రసభస్మము; కాలొమల్; మెర్క్యురస్‌క్లోరైడ్; పూరం.

దీనిలో రెండు మూలద్రవ్యము లున్నవి:—

2. ప. అ. పారదము ... 400 ప. అ. భా.
2. ,, హారినము ... 71 ,,

(ఆ) సవ్వీరము; ఖాండకర్పూరము; కరోసివ్ సబ్లియేట్; పారదికహారిదము; మెర్క్యురిక్ క్లోరైడ్; వీరం.

దీనిలోను రసకర్పూరములోనున్న మూలపదార్థములే యున్నవి. కాని వానిపరిమితి భేదించినందువలన నిది విషతుల్యమైన సవ్వీరపాషాణమైనది. ఒకయణువు సవ్వీరములో

1. ప. అ. పారదము ... 200 ప. అ. భా.
2. ,, హారినము ... 71 ,,

**15**. (అ) తామ్రభస్మము; తామ్రకామ్లజనిదము; కూప్రిక్ ఆక్సైడ్; ఎఱ్ఱనిభస్మము.

దీనిలో రెండు మూలద్రవ్యము లున్నవి:—

2. ప. అ. తామ్రము ... 127 ప. అ. భా
1. ,, అమ్లజని ... 16 ,,

(ఆ) తామ్రభస్మము; తామ్రికామ్లజనిదము; కూప్రిక్ ఆక్సైడ్; నల్లనిభస్మము.

దీనిలో సయితము (అ) తా మ్రభస్మములోనున్న రెండ పదార్థములే యుండును కాని పరిమాణభేదము గలదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | తామ్రము | ... | 635 | ప. అ. భా. |
| 1. | ,, | అమ్లజని | ... | 16 | ,, |

**16**. మైలతొత్తు; మయూరతుత్థము; నీలశిల; బ్లూ స్టోన్; తామ్రగంధకిదము; కాపర్ సల్ఫేట్; దీనిలో మూడు మూలద్రవ్యము లున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | తామ్రము | ... | 63·5 | ప. అ. భా. |
| 1. | ,, | గంధకము | ... | 32 | ,, |
| 4. | ,, | అమ్లజని | ... | 64 | ,, |

**17**. (అ) లోహసిందూరము; రక్తహోమితాయితము; ఫెర్రిక్ ఆక్సైడ్.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| దీనిలో | 2. | ప. అ. | లోహము | ... | 112 | ప. అ. భా. |
| | 3. | ,, | అమ్లజని | ... | 48 | ,, |

ఈ లోహసిందూరమునందు కాసీససిందూరమునందున్న గుణములే యున్నవి. మరియు ఆ లోహసిందూరమునందున్న వస్తువులే యంతియ పరిమాణములు గలవిగాయె కాసీస సిందూరమునం దున్నవి.

(ఆ) లోహసిందూరము; అయస్కాంతాయితము; కాంతపురాళ్లభస్మము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3. | ప. అ. | లోహము | ... | 168 | ప. అ. భా. |
| 4. | ,, | అమ్లజని | ... | 64 | ,, |

(ఇ) గైరికము; రస్ట్; లోహకిటము;

దీనిలో గూడ 17 - అ లో జెప్పబడిన పదార్థములో నున్న మూలద్రవ్యములే అంతియ పరిమాణములు గలిగియున్నవి. గైరిక మెట్లేర్పడుననిన: లోహమును ఎండవేడిమి, గాలిలోని నీటియావిరి, గాలిలోని అమ్లజని, బొగ్గుపులుసు వాయువు మొదలగునవి స్పృశించినచో సంయోగవియోగ రసాయనవికారములు గలిగి గైరిక మగును.

(ఈ) మండూరము.

17-ఇ లో చెప్పబడిన గైరికమే భూమిలో పూడి మట్టి మొదలగువస్తువులతో గలిసియున్నపదార్థమే మండూరము. దీని నపరిశుద్ధలోహసిందూరమని చెప్పవచ్చును.

**18.** కాసీసము; అన్నభేది; ఫెర్రస్ సల్ఫేట్.

దీనిలో లోహము, గంధకము, అమ్లము ఉన్నవి. ఒక యణువు కాసీసములో

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | లోహము | ... | 56 | ప. అ. భా. |
| 1. | ,, | గంధకము | ... | 32 | ,, |
| 4 | ,, | అమ్లజని | ... | 64 | ,, |

దీని నెఱ్ఱగనగువరకు కాల్చిన సిందూరించును. ఇట్లు సిందూరించిన దీనిని పరిశోధించినచో 17-అ లోని పదార్థసంఘుటనము గలిగియుండును. గుణములు గూడ మారియుండవు.

**19.** (అ) గంగాసిందూరము; (గంగసిందూరము); రక్తసీసామ్లజనిదము; రెడ్ లెడ్.

ఒక యణువు గంగసిందూరములో

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3. | ప. అ. | సీసము | ... | 621 | ప. అ. భా. |
| 4. | ,, | అమ్లజని | ... | 64 | ,, |

(ఆ) నాగభస్మము; మృదారుశింగు.

నాగము నొక లోహపాత్రయందు గరిగిరాచుచున్న భస్మ మగును. అదెట్లనిన: సీసము కరుగుచుండు కాలమున గాలిలోనుండు అమ్లజని దానితో జేరిన భస్మ మగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | సీసము | ... | 207 | ప. అ. భా. |
| 1. | ,, | అమ్లజని | ... | 16 | ,, |

207 తులముల సీసము పైరీతిగ గరిగించి రాచుచుండిన యెడల గాలిలోనుండి 16 తులము అమ్లజని గలిసి భస్మీకరణమై 223 తులముల భస్మమగును. దీనివలన తేటపడినయంశ మేమన: అమ్లజనిసంపర్కము లేనిది నాగము కానేరదనుటయె. ఇట్లే వంగము, యసదము మున్నగునవి సయితము అమ్లజని సంపర్కముచే భస్మములగును.

**20.** ఇంగ్లీకము; కజ్జలి; మెర్క్యురి సల్ఫైడ్; పారదగంధకిదము.

దీనిలో పారదగంధకము లున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | పారదము | ... | 200 | ప. అ. భా. |
| 1. | ,, | గంధకము | ... | 32 | ,, |

**21**. (అ) రససిందూరము; పారదికామ్లజనిదము; మెర్క్యూరిక్ ఆక్సైడ్; (ఎఱ్ఱనిది)

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ప. అ. | పారదము | ... | 200 ప. అ. భా. |
| 1. | ,, | అమ్లజని | ... | 16 ,, |

(ఆ) రససిందూరము; పారదామ్లజనిదము.
మెర్క్యూరస్ ఆక్సైడ్; (నల్లనివర్ణము)

| | | | | |
|---|---|---|---|---|
| 2. | ప. అ. | పారదము | ... | 400 ప. అ. భా. |
| 1. | ,, | అమ్లజని | ... | 16 ,, |

**22**. ఎముకలభస్మము; బోన్ఆష్; ఖటికస్ఫురము.
దీనిలో స్ఫురము (భాస్వరము, ఫాస్ఫరస్) యున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 3. | ప. అ. | ఖటికము | ... | 120 ప. అ. భా. |
| 2. | ,, | స్ఫురము | ... | 62 ,, |
| 8. | ,, | అమ్లజని | ... | 128 ,, |

**23**. సముద్రలవణము = సాల్ట్:—

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ప. అ. | సోడియం | ... | 23 ప. అ. భా. |
| 1. | ,, | హరినము | ... | 35·5 ,, |

**24**. (అ) వంగభస్మము=వంగామ్లజనిదము, నల్లనిభస్మము:—

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ప. అ. | వంగము | ... | 118 ప. అ. భా. |
| 1. | ,, | అమ్లజని | ... | 16 ,, |

(ఆ) తెల్లనిది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ | వంగము | ... | 118 | ప. అ. భా. |
| 2. | ,, | అమ్లజని | ... | 32 | ,, |

**25.** పాలతుత్థము = జింక్ సల్ఫేట్:—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | యసదము | ... | 65 | ప. అ. భా. |
| 1. | ,, | గంధకము | ... | 32 | ,, |
| 4. | ,, | అమ్లజని | ... | 64 | ,, |

**26.** వెలిగారము = బొరాక్స్ = టంకణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2. | ప. అ. | సోడియం | ... | 46 | ప. అ. భా. |
| 4. | ,, | టంకము | ... | 44 | ,, |
| 7. | ,, | అమ్లజని | ... | 112 | ,, |

ఇది పదియణువులనీరుతో గలిసి స్ఫటికీకరణమై యుండును. అగ్నిపై వ్రేల్చిన దానిలోనినీ రావిరై యెగిసి పొంగ పటికివలె బత్తీసవలె పొంగును.

**27.** సోరుప్పు; నైటర్.

దీనిని తుపాకిమందులో వాడుదురు. పోరాయను వ్యవహారనామము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప. అ. | పోటాసియం | ... | 39 | ప. అ. భా. |
| 1. | ,, | నత్రజని | ... | 14 | ,, |
| 1. | ,, | అమ్లజని | ... | 16 | ,, |

సూచన:—ఆయుర్వేదవైద్యసోదరులు పలువురు పదార్థవిజ్ఞానవిషయములను వివరించు నొకచిన్నపొత్తమును వ్రా

శ్రీ

# వైద్య ప్రకాశిక

## 3. వ్యాధి గణములు.

---

ఆయుర్వేద యోగములందనేకౌషధులు, మూలికలు మొదలగువానిని వాడుచున్నాము. వీనిగుణములను వివరించు గ్రంథము లనేకము లున్నవి. కావున నిట గ్రంథవిస్తర భీతిచే గుణములను వివరించుట మానుకున్నాము. పైవానిని గణములుగ విభజించి యొక్కొక్క గణముక్రింద నేయే యౌషధులు మున్నగునవి జేరునో వానిని పట్టికలలో వ్రాయుట సమంజసమనకతప్పదని దలంచి యీగణావిభాగము నాయుర్వేదవైద్యులకు మిగుల సహాయపడునని దలంచి చరకాదిగ్రంథపరిశోధనాపూర్వకముగ సాధ్యమైనంతవరకు నీక్రిందివిధముగ వివరించుచున్నాము.

ఒక్కొక్క గణమునందు జేరిన వృక్షముల కనేకగుణము లుండినను ఆగణమునకు నర్హమైనగుణము సమితముండుటచే యాగణమునందు జేర్పుచున్నాము. అదెట్లనిన: జీవకము, ఋషభకము, మేధ, మహామేధ, కాకోళి, క్షీరకాకోళి, మాషపర్ణి, ముద్గపర్ణి, జీవంతి, యష్టిమధు మొదలగునవి

శ్రీ

# వైద్య ప్రకాశిక

## 3. వ్యాధిగణములు.

---

ఆయుర్వేదయోగములందనేకౌషధులు, మూలికలు మొదలగువానిని వాడుచున్నాము. వీనిగుణములను వివరించు గ్రంథములనేకము లున్నవి. కావుననిట గ్రంథవిస్తర భీతిచే గుణములను వివరించుట మానుకున్నాము. పైవానిని గణములుగ విభజించి యొక్కొక్క గణముక్రింద నేయే యౌషధులు మున్నగునవి జేరునో వానిని పట్టికలలో వ్రాయుట సమంజసమనకతప్పదని దలంచి యీగణావిభాగము నాయుర్వేదవైద్యులకు మిగుల సహాయపడునని దలంచి చరకాదిగ్రంథపరిశోధనాపూర్వకముగ సాధ్యమైనంతవరకు నీక్రిందివిధముగ వివరించుచున్నాము.

ఒక్కొక్క గణమునందు జేరిన వృక్షముల కనేకగుణము లుండినను ఆగణమునకు నర్హమైనగుణము సయితముండుటచే యాగణమునందు జేర్చుచున్నాము. అదెట్లనిన: జీవకము, ఋషభకము, మేధ, మహామేధ, కాకోలి, క్షీరకాకోలి, మాషపర్ణి, ముద్గపర్ణి, జీవంతి, యష్టిమధు మొదలగునవి

ప్రత్యేక ప్రత్యేకముగ వస్తుగుణముల బొందియున్నను వీని యందు జీవాధారకమైన గుణముండుటచే చరకాచార్యులు జీవనీయగణముక్రింద జేర్చియున్నారు. ఇట్లు వారొనర్చిన యేబదిగణములను వివరించినపిదప నాచే విభజింపబడిన యేబది యారుగణములను "వంశవృక్ష" రూపముగ తెలియపర్చు చున్నాను.

చరకాచార్యులవారిచే విభజింపబడినగణము లేబది:—

1. జీవనీయము = జీవమును వృద్ధిజేయునది.
2. బృంహణీయము = శరీరమును వృద్ధిపరుచునది.
3. లేఖనీయము = మలాదులను నివారించునది.
4. భేదనీయము = మలాదులను భేదించునది.
5. సంధానీయము = వీడిపోయిన యవయవాదులఁ గూర్చునది.
6. దీపనీయము = జాఠరాగ్నిని వృద్ధిజేయునది.
7. బలీయము = బలమును వృద్ధిజేయునది.
8. వర్ణ్యము = శరీరమునకు గాంతిని కలిగించునది.
9. కంఠ్యము = కంఠమునకు మేలుజేయునది.
10. హృద్యము = హృదయమునకు మేలుసేయునది.
11. తృప్తిఘ్నము = శ్లేష్మవికారతృప్తిని నివారించునది.
12. అర్శోఘ్నము = మూలవ్యాధిని నణచునది.
13. కుష్ఠఘ్నము = కుష్ఠముఁ దొలగించునది.
14. కండూఘ్నము = దురదనణచునది.

15. క్రిమిఘ్నము = క్రిముల నశింపఁజేయునది
16. విషఘ్నము = విషదోషముల హరించునది.
17. స్తన్యజననము = స్తన్యమును కలిగించునది.
18. స్తన్యశోధనము = స్తన్యమును శోధనము జేయునది.
19. శుక్రజననము = వీర్యమును బుట్టించునది.
20. శుక్రశోధనము = శుక్రమును శుద్ధిజేయునది.
21. స్నేహోపగము = తైలకర్మమున కుపయోగించునది.
22. స్వేదోపగము = స్వేదకర్మయం దుపయోగపడునది.
23. వమనోపగము = వమనకర్మయందు వాడఁబడునది.
24. విరేచనోపగము = విరేచనకర్మయం దుపయోగమగునది.
25. ఆస్థాపనోపగము = వస్తికర్మయం దుపకరించునది.
26. అనువాసనోపగము = అనువాసనవస్తికి నుపకరించునది.
27. శిరోవిరేచనము = కాసను హరించునది (దగ్గు)
28. ఛర్దినిగ్రహము = ఛర్దికర్మయం దుపకరించునది (శ్వాస).
29. తృష్ణనిగ్రహము = తృష్ణకర్మయం దుపకరించునది.
30. హిక్కానిగ్రహము = వెక్కిళ్లను బోగొట్టునది.
31. పురీషసంగ్రహణీయము = మలమును గట్టిపరచునది.
32. పురీషవిరజనీయము = అమేధ్యమునందలి దోషముల నివారించునది.
33. మూత్రసంగ్రహణీయము = మూత్రమాపునది.
34. మూత్రవిరజనీయము = మూత్రదోషముఁ బోగొట్టునది.

35. మూత్రవిరేచనము = మూత్రమును బ్రవర్తింపఁజేయు నది.
36. కాసహరము = దగ్గును బోఁగొట్టునది.
37. శ్వాసహరము = శ్వాసను హరించునది.
38. శోథహరము = వాపును నశింపఁజేయునది.
39. జ్వరహరము = జ్వరముల బోఁగొట్టునది.
40. శ్రమహరము = బడలికఁ దొలంగజేయునది.
41. దాహప్రశమనము = తాపము నివారించునది.
42. శీతప్రశమనము = శీతమును నివారించునది.
43. ఉదర్దప్రశమనము = ఎట్టునిదద్దులను హరించునది.
44. అంగమర్ద ప్రశమనము = ఒడలినొప్పుల బోఁగొట్టునది.
45. శూలప్రశమనము = శూలను హరించునది.
46. శోణితస్థాపనము = రక్తమును నిలుపునది.
47. వేదనాస్థాపనము = బాధఁదొలఁగించునది.
48. సంజ్ఞాస్థాపనము = స్మృతిఁగలుగఁజేయునది.
49. ప్రజాస్థాపనము = సంతానము కలిగించునది.
50. వయస్థాపనము = వయస్సును స్థాపించునది.

మాచే విభజింపఁబడిన గణములు 56—వీని వంశవృక్షము.

బాహిరాశ్రయాంతరాశ్రయములని యోగములు రెండు. బాహిరాశ్రయయోగమన లేపనము చేసికొనియెడు ఔషధమండలి. అంతరాశ్రయమన సేవించునౌషధమండలి. బాహిరాశ్రయయోగమునందు మర్దనశోధనలేపనము, రసాయనికశోధనలేపనము, భౌతికశోధనలేపనయోగమను మూడు యోగములు గలిగెను. అంతరాశ్రయయోగమునందు జీర్ణమండలశోధకము, రక్తశోధకము, అభిసరణమండలశోధకము, శ్వాసాశయశోధకము, మస్తిష్కమజ్జా (నాడీ) మండలశోధకము, మూత్రావయవశోధనము, స్త్రీపురుషజననేంద్రియశోధకము, స్వేదశోధకము, శరీరోష్ణశోధకము, విభజనీయమను నీ పదియోగములు 'గలిగెను. పై బాహిరాశ్రయమందు గలిగిన మర్దనశోధనమున దంతధావనము, రసాయనిక శోధనలేపమునందు విదాహి, గ్రాహి, యుపసర్గఘ్నమను మూడు గణములు గలిగెను. భౌతికశోధనలేపనమున శోషహారము, స్నేహనమను రెండుగణములు గలిగెను. జీర్ణమండలశోధకమున బాచనము, వాతహారము, పులిత్రేపులను హరించు గణము, వమనోపగము, ఛర్దినిగ్రహము, విరేచనోపగము, గ్రాహి, స్నేహోపగము, విషఘ్నము, క్రిమిఘ్నము, పిత్తహారము, లాలోత్పాదకము, లాలోత్పాదకహారము అనునవి పదమూడుగణములు గలిగెను. రక్తశోధకమున శోణితవర్ధనము, శోణితక్షీణము, శోణితపేలవ మను మూడుగణములు గలిగెను. అభిసరణమండలశోధకమున దీపనము, శామ

కము, శోణితస్థాపనమను మూడుగణములు గలిగెను. శ్వాసాశయశోధకమున కఫఘ్నము, కఫనిరోధము, కాసహరము, శ్వాసహరమను నాల్గుగణములు గలిగెను. మస్తిష్క-మజ్జామండలశోధనమున మనశ్శోధనము, నిద్రాశోధనము, సంజ్ఞాశోధనము, చలననాడీశోధనమను నాల్గు గలిగెను. మనశ్శోధకమున మనోత్సాహకరము, బుద్ధిస్తంభనమను రెండుగణములు గలిగెను. నిద్రాశోధనమున నిద్రాప్రదము, నిద్రారోధమను రెండుగణములు గలిగెను. సంజ్ఞాశోధనమున సంజ్ఞాకరము, సంజ్ఞాహరము, వేదనాస్థాపనమను మూడుగణములు గలిగెను. చలననాడీశోధనమున బల్యము, బలక్షీణము, ఆక్షేపకకరము, ఆక్షేపకహరము, కనుపాపను పెద్దగజేయునది, కనుపాపను చిన్నగజేయునదియను నారుగణములు గలిగెను. మూత్రావయవశోధకమున మూత్రలము, మూత్రసంగ్రహణీయము, స్రావకము, అశ్మరీహరము, అశ్మరీఘ్నము అను నైదుగణములు గలిగెను. స్త్రీపురుషజననేంద్రియశోధకమున వృష్యము, అవృష్యము, ఋతుప్రదము, ఆవీప్రదమను నాల్గుగణములు గలిగెను. స్వేదశోధకమున స్వేదలము, స్వేదఘ్నమను రెండుగణములు గలిగెను. శరీరోష్ణశోధకమున ఉష్ణాధిక్యము, శీతప్రదమను రెండుగణములు గలిగెను. విభజనీయమున గ్రంథిభేదీయమనుగణము గలిగె.

ఇంక పై 56 గణముల ముఖ్యార్థములు వ్రాయుచున్నా

ము. బాహిరాశ్రయాంతరాశ్రయశబ్దముల యర్థము లిది వఱకే వ్రాసియున్నాము.

1. దంతధావనము = దంతములను పరిశుభ్రముగా నుంచునది.
2. విదాహి = శరీరమున నేభాగమునకు పట్టించిన నా భాగమును గాల్చునది.
3. గ్రాహి = నరములను సంకుచితముగా చేసి రక్తవాహినుల యాకారమును సన్నగ చేయునది
4. ఉపసర్గఘ్నము = అంటురోగజంతువులు లేక రోగములను కలిగించెడివిషమును నాశ మొనరించునట్టివి.
5. శోఫహరము = దీనిని పట్టించినచోట చర్మము నెఱ్ఱబడ జేసి శోఫను పూరించునది.
6. స్నేహానము = లేపనమువల్ల శరీరమునకు మృదుత్వమును కలుగ జేయునట్టిది.
7. పాచనము = జఠరకార్యమును వృద్ధిపరచి జీర్ణశక్తిని, ఆకలిని వృద్ధిపరచునట్టిది.
8. వాతహారము = కడుపు, ప్రేగులద్వారా వాయువును బయట ద్రోయునట్టిది.
9. పులిత్రేనుపుల కట్టునవి.
10. వమనోపగము = వాంతిని గావించునది.
11. ఛర్దినిగ్రహము = వాంతిని గట్టునది.

12. విరేచనోపగము = ప్రేగులయందలి మలమును బయట ద్రోసి శుద్ధి జేయునట్టిది.

13. గ్రాహి = విరేచనముల గట్టునది; పాచనశక్తిని జక్క జేయుటకు, రక్తస్రావము నిలుపుటకును, శరీరము లోని రసరక్తాదులను తీసికొనిపోవునాళముల జక్క జేయునట్టిది.

14. స్నేహోపగము = శరీరమునందలి లోభాగమును రక్షించి దానికి మృదుత్వము నిచ్చునట్టిది.

15. విషఘ్నము = విశిష్టమయిన విషముయొక్క పరిణామమును తగ్గించునట్టిది.

16. క్రిమిఘ్నము = కడుపులోని క్రిములను బయటత్రోయు నది, లేక నాశ మొనరించునది.

17. పిత్తహారము = అధికమైన పిత్తమును బయటద్రోయునది, విరేచనమున కొకవిధానమని దీని నుపయోగింతురు.

18. లాలోత్పాదకము = ఉమ్మినీ రూరజేయునది.

19. లాలోత్పాదకహారము = ఉమ్మినీరును తగ్గించునది.

20. శోణితవర్ధనము = రక్తమునందు రక్తకణముల హెచ్చు జేసి రక్తవృద్ధి గావించునది.

21. శోణితక్షీణము = రక్తమును తగ్గించునది.

22. శోణితపేలవము = రక్తమును పలచనచేయునది.

23. దీపనము = శరీరమునందలి యవయవములకు త్తేజమును గలిగించి కార్యోత్సాహమును వృద్ధిచేయునట్టిది.

24. శామకము = వేదనను తగ్గించి శాంతి నొసంగునట్టిది. శరీరమునందలి ప్రత్యుద్ధస్థితిని శాంతి నొందించునట్టిది.

25. శోణితస్థాపనము = రక్తస్రావమును నిలుపునది.

26. కఫఘ్నము = ఎదనుండి (కంఠనాళము క్రిందిభాగమున గల యిరుపార్శ్వములనుండి) కఫమును బయట ద్రోయునది.

27. కఫనిరోధము = కఫమును వృద్ధిపొందనివ్వనిది.

23. కాసహారము = దగ్గును హరించునది.

29. శ్వాసహారము = దమ్మును హరించునది.

30. మనోత్సాహకరము = మనస్సునకు ఉత్సాహమును గలుగజేయునవి.

31. బుద్ధిస్తంభనము = బుద్ధిని భ్రంశించునది.

32. నిద్రాప్రదము = నిద్రను దెచ్చునది.

33. నిద్రారోధము = నిద్రను రానివ్వకుండ జేయునది.

34. సంజ్ఞాకరము = మెదడు, పృష్ఠభాగములందు స్మృతినిచ్చునవి.

35. సంజ్ఞాహారము = మెదడు, పృష్ఠభాగములయందు పరిణామమును గలిగించి స్మృతిని దప్పించునట్టిది.

36. వేదనాస్థాపనము = మెదడుపై మార్పును గలిగించి బాధ ను తగ్గించునది.

37. బల్యము = శరీరమున కంతయుగాని లేక యొకభాగము నకుగాని బలము నిచ్చునట్టిది.

38. బలక్షీణము = శరీరమునం దంతటనుండు కండరములగాని లేక యొకభాగముననుండు కండరములబలమును తగ్గించునది.

39. ఆక్షేపకకరము = శరీరమునందుండు నరముల నీడ్చునటుల జేయునది.

40. ఆక్షేపకహరము = శరీరమునందుండు నరములనీడ్పును మాన్పునట్టిది.

41. కనుపాపను పెద్దగ జేయునది.

42. కనుపాపను చిన్నగ జేయునది.

43. మూత్రలము = మూత్రమును వృద్ధిచేయునది.

44. మూత్రసంగ్రహణీయము = మూత్రమును తగ్గించునట్టిది.

45. స్రావకము = స్త్రీపురుషమర్మావయవమునుండి స్రవింప జేయునది.

46. అశ్మరీహరము = మూత్రాశయమునందు క్షారములు, రాయి. మొదలగువానిని కూడనివ్వకుండునటుల జేయునది.

47. అశ్మరీఘ్నము = మూత్రాశయమునందు కూడియుండు క్షార.

ములు, మూత్రపురాయి యిత్యాదులను కరగించు నట్టిది

48. వృష్యము = సంభోగేచ్ఛను వృద్ధిజేయునది.

49. అవృష్యము = సంభోగేచ్ఛను తగ్గించునది.

50. ఋతుప్రదము = ఋతుస్రావముయొక్క అక్రమమును నివారణచేసి దానిని క్రమపరచునది.

51. ఆవీప్రదము = గర్భాశయమును సంకుచితముచేసి దాని లోని వస్తువు (గర్భము)ను బయటత్రోయుటకు సహాయకారి యగునది.

52. స్వేదలము = చర్మముయొక్క క్రియాశక్తిని హెచ్చించి చమటను గలుగజేయునది.

53. స్వేదఘ్నము = విశేషముగ వచ్చెడు చెమటను ఆపునట్టిది.

54 ఉష్ణాధిక్యము = శరీరమునందుం డుష్ణమును హెచ్చించునది.

55. శీతప్రదము = శరీరమునందుం డుష్ణమును, జ్వరమును తగ్గించునవి.

56. గ్రంథిభేదీయము = శరీరమునందు బుట్టు గడ్డల దుష్టద్రవకూటమును విప్పునది

శ్రీ

# వైద్యప్రకాశిక

## 4. వృక్షగణములు.



వృక్షసముదాయమును విభాగించి గణములోనర్చి యీభాగమునం దాయాగణముల నామధేయములు వ్రాయుచున్నాము. ఇట్లు వ్రాయుటకుఁ గారణమేమనిన: వైద్యులగువా రాయావృక్షముల నామధేయములకు గలిగిన నామములు దెలిసినను ఈవృక్ష మిది యని యెఱింగినను ప్రయోజనము లేదు. వాని నుపయోగించువిధానము లవి యేగణములలోఁ జేరినసంగతియు మొదలగు వృక్షశాస్త్రవిషయముల నెఱింగినవారే వైద్యులు. తదితరులు వైద్యులు గారు అని చరకాచార్యులవారు తమచరకమునందు:—

మూ. ఓషధీర్నామరూపాభ్యాం జానతే హ్యజపావనే,
అవిపాశ్చైవ గోపాశ్చ యే చాన్యే వనవాసినః.
న నామజ్ఞానమాత్రేణ రూపజ్ఞానేన వా పునః,
ఓషధీనాం పరాం ప్రాప్తిం కశ్చిద్వేదితుమర్హతి.
యోగవిన్నామరూపజ్ఞస్తాసాం తత్త్వవిదుచ్యతే,
కిం పునర్యో విజానీయాదోషధీః సర్వథా భిషక్.

యోగమాసాం తు యో విద్యాద్దేశ కాలోపపాదితమ్,
పురుషం పురుషం వీక్ష్య స విజ్ఞేయో భిషక్తమః.

అను శ్లోకముచేఁ దెలియఁజేసియుండుటయే వృక్ష కుటుంబములఁ దెలుపుటకుఁ గారణము.

| | | | | |
|---|---|---|---|---|
| 1. వాసకాది | గణము | = | అడ్డసరము | మొదలగునవి. |
| 2. చీనీఘూస్ | ,, | = | సముద్రపుపాచి | ,, |
| 3. ఉత్తరేణు | ,, | = | ఉత్తరేణు, గునుగు | ,, |
| 4. సుదర్శన | ,, | = | కేసరి, రాకాసిమట్టలు | ,, |
| 5. ద్రాక్ష | ,, | = | ద్రాక్ష | ,, |
| 6. ఆమ్ర | ,, | = | మామిడి, జీడి, ముంతమామిడి,, | |
| 7. శతావరి | ,, | = | పిల్లిపీచర, సప్తపర్ణ | ,, |
| 8. సురణ | ,, | = | కంద, వస | ,, |
| 9. శపాశన | ,, | = | గాడిదగడపర | ,, |
| 10. అర్క | ,, | = | జిల్లేడు, సుగంధిపాల | ,, |
| 11. నారింగ | ,, | = | కమల, బత్తా, నారింజ | ,, |
| 12. దారుహారిద్రా | ,, | = | కస్తూరిపసుపు | ,, |
| 13. కేసరి | ,, | = | జఫ్రిచెట్టు, చాల్ముగ్ర | ,, |
| 14. గోజిహ్వాది | ,, | = | సూర్యావర్త, ఎద్దునాలుక | ,, |
| 15. విజయా | ,, | = | గంజాయి | ,, |
| 16. హురహుర | ,, | = | వాయింట | ,, |
| 17. సురంజన | ,, | = | సురంజన, తుత్థాంజన | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 18. హిమజ | గణము | = | అర్జున: నల్ల తెల్లమద్ది | మొదలగునవి. |
| 19. సోమరాజ | ,, | = | అడవిజీలకఱ్ఱ | ,, |
| 20. దేవదారు | ,, | = | దేవదారు, తాళీసపత్రి | ,, |
| 21. నిషోత్తర | ,, | = | విష్ణుక్రాంత | ,, |
| 22. సర్షపా | ,, | = | నల్ల, తెల్ల, ఎఱ్ఱ ఆవాలు | ,, |
| 23. దొండ | ,, | = | కాకిదొండ, ఆనబ | ,, |
| 24. ముస్త | ,, | = | తుంగముస్తలు | ,, |
| 25. అకల్‌బర్ | ,, | = | అకల్‌బర్ | ,, |
| 26. గుర్‌జన్ | ,, | = | గుర్‌జన్ | ,, |
| 27. ఏరండ | ,, | = | ఆముదము, ఆకుజెముడు, కుప్పింట | ,, |
| 28. ఘనసలంబ | ,, | = | పుట్టకొక్కులు | ,, |
| 29. దర్భ | ,, | = | గడ్డి(అన్నిజాతులు), వరి | ,, |
| 30. తపింజా | ,, | = | రేవల్చిన్ని | ,, |
| 31. తులసి | ,, | = | తులసి, తుమ్మి | ,, |
| 32. దాల్చిని | ,, | = | లవంగపట్ట | ,, |
| 33. బబ్బులా | ,, | = | తుమ్మ,గురువింద,చంద్ర, గోగు | ,, |
| 34. పలాండు | ,, | = | నీరుల్లి, వెల్లుల్లి, కలబంద | ,, |
| 35. విషతిందుక | ,, | = | విషముష్టి | ,, |
| 36. తిందిష | ,, | = | బెండ, అతిబల | ,, |
| 37. నింబ | ,, | = | వేప | ,, |
| 38. గుడూచీ | ,, | = | తిప్పతీగ, పాతాగరుడ | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 39. జాతీఫల | గణము | = | జాజికాయ | మొదలగునవి. |
| 40. విడంగా | ,, | = | వాయువిడంగములు | ,, |
| 41. జంబులా | ,, | = | నేరేడు | ,, |
| 42. పద్మక | ,, | = | తామర | ,, |
| 43. సాలామిసిరి | ,, | = | సాలామిసిరి | ,, |
| 44. పూగ | ,, | = | పోక, టెంకాయ, తాల | ,, |
| 45. బొప్పాయి | ,, | = | పొప్పడి | ,, |
| 46. పిప్పలి | ,, | = | పిప్పళ్లు, మిరియాలు | ,, |
| 47. ఇస్ఫగోలు | ,, | = | ఇస్ఫగోలు | ,, |
| 48. ఆమ్లవేతస | ,, | = | చుక్కకూర, బీజ్ బంద్ | ,, |
| 49. గులాబీ | ,, | = | గులాబి పూలు | ,, |
| 50. మంజిష్ఠా | ,, | = | మంజిష్ఠా | ,, |
| 51. జంబీర | ,, | = | నిమ్మ, గజనిమ్మ, మాదీఫల | ,, |
| 52. మోహర | ,, | = | సపోటా | ,, |
| 53 ఆర్ద్రిక | ,, | = | అల్లం, శొంఠి, రాస్నా | ,, |
| 54. బ్రాహ్మీ | ,, | = | మండూకబ్రహ్మి, సంబరేణు | ,, |
| 55. మహానింబా | ,, | = | పెద్దమాను | ,, |
| 56. బృహతి | ,, | = | వాకుడు, నేలములక | ,, |
| 57. మృగశి | ,, | = | భూతకట్టి | ,, |
| 58. అజామోద | ,, | = | అజామోదము, వోము | ,, |
| 59. వటాది | ,, | = | మఱ్ఱి | ,, |
| 60. నిర్గుండి | ,, | = | వావిలి | ,, |

61. ఏషా గణము = వత్సనాభి, అతివస మొదలగునవి.
62. గోరక్ చించ్ ,, = సీమచింత ,,
63. గుగ్గిలము ,, = అందుగ, మడ్డిపాల ,,
64. అంకోల ,, = ఊడుగ ,,
65. అలూక ,, = ఆలుగడ్డ, గెనుసు ,,
66. అగ్నిగర్భ గణము = అగ్నివేంద్రపుచెట్టు మొదలగునవి.

---

Note:—వీనిలో గొన్నిటికి సరియైన సంస్కృతపదములు దొరకనందున ఆంధ్రపదములను, దేశీయపదములను గూడ వాడుచు ప్రకృతిగణములలో చేరిన ముఖ్యమగువృక్షముల నామధేయములతో వానిగణములను బేర్కొనియున్నాము.

# శ్రీ జ్యోతిర్విద్యాయుర్వేదవైద్యాలయము.

ఇది ప్రథమమున శికింద్రాబాదు, శెకెండు బజారులో నున్న మాగృహమందు మాచే 1926 సం॥ మున స్థాపింపబడె. ఇది కారణాంతరముచే 1933 సం॥ మున మహబూబునగరమునకు మార్చబడెను. స్థాపింపబడిననాటినుండి నేటివఱకు మే మభ్యసించిన పాశ్చాత్యవిద్యచేతను, ఉత్తీర్ణమైన రసాయన పదార్థవిజ్ఞానశాస్త్రాదులవలనను, ఆయుర్వేదపరిశ్రమవలనను, సాధ్యమైనంతవఱకు సక్రమముగ యంత్రములసహాయముచే వివిధౌషధముల సిద్ధపరచి వానిని యీజిల్లావరకే గాక యనేక ప్రదేశములకు నందుబాటు సేయుచున్నాము. మఱియెందరో మాయౌషధాలయమున నౌషధములు సేవించి యారోగ్యవంతులై యోగ్యతాపత్రము లొసంగియున్నారు. వానినన్నిటిని విస్తరభీతి వదలి రెండుమాత్రము వ్రాసియున్నాము. సంవత్సరమునకు రమారమి 3,000 మంది మావైద్యాలయమున జికిత్స నొందుచున్నారు. ఆయుర్వేదవైద్యాభివృద్ధికై వివిధములైన చతుర్విధౌషధులుగల యారామ మొకటి స్థాపించియున్నాము. ఈ యారామప్రశంస 10 జూలై 1939 సం॥ సోమవారపు గోలకొండపత్రికయందు వివరింపబడినది. చదువరులకు దెలియుటకై దాని నీక్రింద వ్రాయుచున్నాము:—



శ్రీ శ్రీశైల ఘంటామఠం సిద్ధిలింగయ్యగారు, హకీం,

సంయుక్తకార్యదర్శి: శ్రీ జ్యోతిర్విద్యాయుర్వేదవైద్యాలయము

మహబూబునగరము.

"ప్రపంచమందలి నానావిధ వైద్యములలో నాయుర్వేదవైద్య ముత్తమోత్తమమని ఖండాంతరవాసులచేగూడ బొగడబడుచున్నయంశము క్రొత్తది కాదు. అట్టి యాయుర్వేదానుసారముగ జేయు నౌషధములచే రుగ్మతలు నివారణ యగుటకు సందియము లేదు. కాని యట్లారోగ్యమగుట లేదు. అందుకు కారణము ఆయాయౌషధములను సిద్ధపరచుటయందు వానియోగముల నుపయోగపడు ఓషధులు, వనస్పతులు, వానస్పత్యములు, మొదలగునవి ఒకస్థలమునందు లేనందున పలుతావులనుండి స్వీకరింపవలసి వచ్చుచున్నది. అట్లు సంపాదించుట దుస్తరమై లభించిన కొన్నిటిచేతనే యౌషధములు సిద్ధముచేయుటవలనను, సమయానుకూలముగ నంగడులలో దొరకు నిర్వీర్యమగు ప్రాతదినుసులను చేర్చి చేయుటవలనను తత్తదౌషధములు నారోగ్యము నివ్వజాలవు. కావున నిట్టిలోపమును సవరించుటకు నొకయాయుర్వేదారామము స్థాపించి వానిలో నౌషధోపయోగవనస్పతులు మున్నగునవి వేసి పెంచుట యావశ్యకమనక తప్పదు. కావున నిట్టి యారామమును మహబూబునగరమునకు నారుమైళ్లదూరమునసుండు భూతుపూరను గ్రామంబున టీ. వీ. భాస్కర్, బి. ఎస్. సి. (జ్యోతిర్విద్యాయుర్వేదవైద్యాలయాధ్యక్షులు) గారు స్థాపించుచున్నారు. వీరివలెనే ఆయుర్వేదవైద్యులు సాధ్యమైనంతవరకు నాయుర్వేదారామములు స్థాపించి యాయుర్వేదాభివృద్ధిచేయుట సమంజసము."

ఇంతియె గాక జాతకములు కూడ నుత్తమోత్తమముగా వ్రాయబడును. ఖగోళభగోళవిషయపరిజ్ఞానము గలుగునట్లు పంచాంగము గుణించుసిద్ధాంతము బోధింపబడును. కావున సోదరాంధ్రులు, ఆంధ్రేతరులు మాచెంతగల యౌషధములు దెప్పించికొనియో చికిత్స జెందియో, దేశసేవకై పాటుబడి సేయుచున్న మాయాయుర్వేదాభివృద్ధికి దోడ్పడ గోరుచున్నాము.

మావైద్యాలయమున ఖజ్జలీయౌషధములు, రసౌషధములు, భస్మములు, సిందూరములు, క్వాథములు, ఘనకషాయములు, ఆసవములు, అరిష్టములు, చూర్ణములు, బిళ్లలు, మాత్రలు, అవలేహములు, ఘృతములు, తైలములు, అంజనములు, లేపనములు, రసాయనములు, మకరధ్వజము మొదలగునవి లభింపగలవు. సరసమైనవెలలకు దొరకగలవు. ఒకసారి సేవించినచో తమకే మాయౌషధములప్రాశస్త్యము తేటపడగలదు.

సరసమైన కమీషన్‌పైన నిజామురాష్ట్రమందంతటను ప్రచారము సేయుటకు నేజంట్లు కావలయు. వివరములకు వ్రాయుడు.

ఇట్లు,
**టి. వి. భాస్కర్.**

పాయగా ఇన్‌ఫన్‌ట్రీ,
29, ఆగస్టు, 1937.

మహబూబునగరములో గల డాక్టరు భాస్కర్ గారి జ్యోతిర్విద్యాయుర్వేదవైద్యాలయమునందలి పనులను కనుగొని నే నెంతయు సంతసించితిని. ఈమందులు ఆయుర్వేదశాస్త్రోక్తముగ కడు జాగ్రత్తతో నూతనమైన, ఉత్తమమైన మూలికలచే సిద్ధము చేయబడినవి. ఈవైద్యాలయాధ్యక్షులగు శ్రీయుత టి. వి. భాస్కర్ గారు రసాయనశాస్త్రమందు మిగుల పరిచయము గలవా రగుటచే సుప్రసిద్ధయోగములచే ననేకౌషధములు గావించి యవి తమవైద్యాలయమున పలువురకు ప్రయోగించి యారోగ్యమును గనుగొనినపిమ్మట నే విక్రయించుచున్నారు.

వీరిచెంత తమ కవసరములగు నౌషధములను గైకొని ఆరోగ్యవంతులై, యీవైద్యాలయమును వృద్ధిచేయుదురని నమ్ముచున్నాను.

పాయగా ఇన్‌ఫన్‌ట్రీ,
హైదరాబాదు.

ఎ. వి. రాజగోపాల్,
మెడికల్ ఆఫీసర్.

లాలాగుడా, N. S. Ry,
22, సెప్టెంబరు, 1937.

శ్రీయుత టి. వి. భాస్కర్ గారి యాతిథ్యమును సంతోషముగ స్వీకరించి, మహబూబునగరములో గల వారి జ్యోతిర్విద్యాయుర్వేదవైద్యాలయమును చూచియు, వీరి యౌషధములను శ్రద్ధతో వీక్షించియు సంతసించితిని. వీరి మందులన్నియు చాలా ఉత్కృష్టమైనవి. ఆయుర్వేదశాస్త్రోక్తముగ, ఉత్తమమైన మూలికలచే జాగ్రతతో సిద్ధము చేయబడినవి. నేను స్వయముగ "భాస్కరలవణచూర్ణము" మరియు "అశ్వగంధారిష్ట" సేవించి మంచి పర్యవసానము బడసితిని. వీరికి సంపూర్ణాయుర్వేదశాస్త్రజ్ఞానము గలదు. మరియు వీరిచే సిద్ధముచేయబడిన యౌషధము లన్నియు నమ్మకమైనవి.

వీరిచే సిద్ధముచేయబడిన మందులు కొని, లాభమును పొంది ప్రజలు ఈవైద్యాలయమును వృద్ధిలోనికి తెచ్చెదరని నమ్ముచున్నాను

ఎన్. నరసింహులు,
రిటైర్డ్ అసిస్టెంట్ సర్జన్,
ఎన్. ఎస్. ఆర్., లాలాగుడ.

# పథ్యాపథ్యములు.

పథ్యాపథ్యములగుఱించి యొక ముఖ్యాంశము సెప్పక తప్పదు. వైద్యులు వైద్యేతరులు పథ్యవిషయమునందు విపరీతమైన యభిప్రాయములు గలిగియున్నారు. మాయౌషధాలయమున నౌషధములు సేవించినజనులందఱు ఔషధ మొసగినతోడనే పథ్యమేమని యడుగుదురు. ఇట్లౌషధమునకు పథ్యమడుగుట వాడుకై యున్నది. ఇదివఱకు వారికి చికిత్స లొనర్చినవారె యిట్టి యభ్యాసమునకు గారకులనక తప్పదు. పథ్యాపథ్యపరిజ్ఞాన ముండినచో నిట్టి వ్యర్థప్రశ్న లొనరింపరు. ఆయుర్వేదవైద్యులు పథ్యాపథ్యశాస్త్రవిషయము బరిశోధించుట సమంజసము. రోగమునకు పథ్యము ప్రాముఖ్యము గాని యౌషధమునకు పథ్యము సంబంధ మించుకయు లేదు. అనగా రోగగ్రస్తుడు రోగమునకు ననుకూలింపనిపదార్థముల నౌషధము సేవింపకున్నకాలమందు సహితము భుజింప తగదు. కనుక ఔషధసేవాకాలముననే పథ్యముగ నుండవలయునని తలంచుట, బోధించుట యించుక సమంజసము కానేరదు. పథ్యవిషయమును గుఱించి హారీతసంహితయందు:—

"సదా పథ్యం ప్రయోక్తవ్యం నాపథ్యేన స సిధ్యతి,
ఔషధేన వినా పథ్యైః సిధ్యతే భిషగుత్తమైః,
వినా పథ్యం న సాధ్యం స్యాదౌషధానాం శతైరపి."

రోగి యెల్లప్పుడును పథ్యముగనే యుండవలయును. అపథ్యముతో రోగము కుదురనేరదు. బుద్ధిమంతుడైనవైద్యు

డౌషధములు లేకయే పథ్యముగ రోగి నుంచి రోగమును కుదుర్చగలడు కాని యపథ్యముతో నూరౌషధములు కూడ రోగమును కుదుర్చజాలవు. వైద్యవినోదమను గ్రంథములో నీ విషయము నే స్పష్టముగ జెప్పియున్నారు:—

"పథ్యే సతి గదార్తస్య కిమౌషధనిషేవణమ్,
పథ్యేఽసతి గదార్తస్య కిమౌషధనిషేవణమ్."

పథ్యముగ నున్నయెడల ఔషధము సేవించుట యెందుకు? అపథ్యముగ నున్నయెడల నౌషధము సేవించుట యెందుకు? అనగా పథ్యముగ నున్న ఔషధము సేవించుట యనవసర మనియు, యపథ్యముగనుండి యౌషధము సేవించుట వ్యర్థమని తేటపడుచున్నది. పథ్యమనగా నొక్క యాహారమే గాదు. పథ్యమనుశబ్దములో ననేకాంశములు గూడియున్నవి. చక్రపాణిదత్త యనుగ్రంథములో నిట్లు వ్రాసియున్నది —

"ఆచారః కాయవాఙ్మానసం కర్మ దల్పాణ చేష్టాశ్చ దృష్టఫలాః, చేష్టాశబ్దేన మనశ్చేష్ట్యాపి సత్యావజయ లక్షణాగృహాయతే."

ఇవన్నియు నిట్లుండ నాహారవిషయములో రోగికి వాని ప్రకృతి, రుచి మొదలగువానిని దృక్పథమున నుంచుకొని మిగుల జాగ్రతతో పథ్యములను నియమింపవలయును. రోగికి రుచికరమగు నాహారము నివ్వనిపక్షమున యిచ్ఛా పూర్వకముగ భుజింపకపోవుటయే గాక తృప్తిపొందకయుండు.

అందుతో దుర్బలము సంభవించును. దుర్బలముచే రోగము ప్రాబల్యమగును. కనుక రోగికి నిష్టమైన, రుచికరమగు పథ్య పదార్థముల నివ్వవలసియుండును.

లంఘనము, చప్పిడి, మిరుపకారమన్నము.

ఈప్రాంతములతో యుక్తాయుక్తపరిజ్ఞానము లేక లంఘనము, చప్పిడి, మిరుపకారమన్నము పథ్యములుగఁ బెట్టుచున్నారు. లంఘనవిషయ మాలోచింతము :—

"యత్కించిల్లాఘవకరం దేహే తల్లంఘనం స్మృతం,
చతుష్ప్రకారా సంశుద్ధిః పిపాసా మారుతాతపౌ,
పాచనాన్యుపవాసశ్చ వ్యాయామశ్చేతి లంఘనం,
జ్వరే లంఘనమేవాదా వుపదిష్టమృతే జ్వరాత్,
క్షయానిలభయక్రోధకామశోకశ్రమోద్భవాత్."
(చరకసంహిత)

"ఊర్ధ్వమారుతతృష్ణాక్షున్ముఖశోషశ్రమాన్వితైః,
న కార్యం (లంఘనం) గర్భిణీవృద్ధబాలదుర్బలభీరుభిః."
(సుశ్రుతసంహిత)

"లంఘనేన క్షయం నీతే దోషే సంధుక్షితేఽనలే,
ప్రాణావిరోధినా చైనం లంఘనేనోపపాదయేత్,
బలాధిష్టానమారోగ్యం యదర్థోయం క్రియాక్రమః.
(చరకసంహిత).

వివిధాభిప్రాయము లిట్లున్నవి. కనుక ప్రతివైద్యుడు రోగియొక్క బలమును కాపాడుటయే ప్రాధాన్యము. లంఘన

ములు, చప్పిడి, మిరుపకారమన్నము పథ్యముపెట్టిన రోగి దుర్బలుడగుటయే గాక యతనిరోగము కుదురుట యసాధ్య మగును. సాధారణమైన పథ్యాపథ్యపదార్థములు, జావలను వ్రాయుచున్నాము:—

పథ్యములు:—పొట్లకాయ, బీరకాయ, ఆనప (సొరకా య)కాయ, దోసకాయ, ఉల్లెంగడ్డ, పెరుగుతోటకూర, మెంతి కూర, ఆవుపాలు, ప్రాతచింతపండు, ప్రాతచింతకాయపచ్చడి, ప్రాతనిమ్మకాయ ఊరకాయ, మొదలగునవి భుజింపదగినవి. మెత్తగానుడికిన కందిపప్పు, కందికట్టు, తీగెదొండకాయ, బంగా ళదుంప (ఆలుగడ్డ) చారు మొదలగునవి యప్పుడప్పుడు భుజింపవచ్చును.

అపథ్యములు:—వంకాయ, గోంగూర, అరటికాయ, నూనె, ఆవాలు, బచ్చలి, గోరుచిక్కుడు (చమడకాయ), కొయ్యతోటకూర, బెండకాయ, పెరుగు, సెనగపప్పుతో చేసిన పదార్థములు, విశేషముగ కారము, చింతపులుసు మొదలగు నవి భుజింపకూడదు.

జావలు :— సబ్బుబియ్యపుజావ, గోధుమనూకజావ, బియ్యమును కొద్దిగ వేయించి విసరబడిన నూకలజావ మొద లగునవి. వానిలో ఆవుపాలను కలిపిగాని, కలుపకగాని సేవించ వచ్చును. పాలుకలిపినచో కొద్దిగ శర్కర కలుపుకొనవచ్చును. పాలు కలుపనియెడల ఉప్పు గొద్దిగ గలుపుకొని, వ్యాధినిబట్టి, రుచినిబట్టి తత్త్వాదులనుబట్టి సేవింపవలయును.

ఓమ్.

# జీవోద్ధార మాహాత్మ్యము.

(గీతమాలిక)

గీ. అంగవాతప్రకోపంబు నణఁచునెద్ది
గొప్పయతిసారసంఘముల్ గూల్చునెద్ది
పార్శ్వవాయుచయంబులఁ బాపునెద్ది
కుటిలబాధాసమూహముల్ గూల్చునెద్ది
దగ్గులన్ జీర్చి సుఖములన్ దార్చునెద్ది
శ్వాసకాసలఁ దూలించు వజ్రమెద్ది
దంతబాధల నడఁచు సిద్ధరసమెద్ది
అరయఁ దలనొప్పిఁ బోకార్చు నమృతమెద్ది
కర్ణశూలాదులన్ జీర్చు ఖడ్గమెద్ది
గ్రహణిరోగంబులన్ జీల్చు గదయునెద్ది
క్రిమిచయంబును విదళించు కేకియెద్ది
వాతపట్టుల తృటిలోన బాపునెద్ది
ఉదరశూలల శిక్షించు నొజ్జయెద్ది
ఆమ్లరోగాలఁ దూలించు నర్థమెద్ది
వాంతిభేదుల నిరసించు బాణమెద్ది
కంఠవాతాబ్ధిఁ దాటించు కలమయెద్ది
యట్టి దివ్య జీవోద్ధార మమలబుద్ధి
యొప్ప సేవించి యారోగ్య మొందుడయ్య
యదియు మహబూబునగరమం దలరు టీ. వి.
భాస్కరుని చెంత లభియించు ప్రాజ్ఞులార
అనఘహృదయాబ్జులార యో యాంధ్రులార.

ఔన్సు సీసా వెల 0-8-0; అరౌన్సు సీసా వెల 0-4-0.

ఇక జబ్బులతోఁ బనిలేదు !  నిరుత్సాహపడవద్దు !!

# "భాస్కరమహామేహాంతకము"

అన్ని విధములగు ప్రమేహములు, సవాయి, నాడీ,నారీ, భగందరము, గండమాల, అనేకరంధ్రములతో మూత్రము వెళ్లుట, వ్రణములు, మూలశంక, నూతనకుష్ఠు, కీళ్లనొప్పులు, పొడలు, బొల్లి, పాతసవాయిసెగలు, మొదలగువాటికి రామబాణమువంటిది. గ్యారంటితో నిర్మూలముగ బాగుజేయును.

తులము 1-కి రూ. 10.

సాంపిలు ౫ దినములకు తగునౌషధము. రూ. 1.

# భా స్క ర యో గ ము

## (కా య క ల్ప ము)

భాస్కరమహామేహాంతకము గుణములు గలిగియుండుటయే గాక మరనేకములైన యుత్కృష్టమైన గుణములు గలిగినది. దీనికి జీవనీయము, వయస్థాపనమనక తప్పదు. పదిపదైదు దినములు సేవించిన దీని యద్భుతమైనగుణములు ప్రత్యక్షములగును. శరీరవర్ణమునుమార్చి కాంతినిచ్చుటయే గాక అకాలమున పలించినకేశములు సహితము తుమ్మెదవర్ణము బోలి నల్లనగును.

దీనివెల తులమునకు రూ. 35.

---

చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1939.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 27 | 5 | మెర్క్యురన్ క్లోరైడ్ | మెర్క్యురస్ క్లోరైడ్ |
| ,, | 9 | సబ్లిమేట్ | సబ్లి మేట్ |
| ,, | 16 | కూప్రిక్ | కూప్రస్ |
| 28 | 3 | 635 | 63·5 |
| 31 | 6 | మెర్క్యురన్ | మెర్క్యురస్ |
| 32 | 8 | బోరాక్ న్ | బోరాక్ స్ |
| 34 | 15 | మాషపర్ణి | మాషపర్ణి |
| 36 | 13 | కాసను హరించునది (దగ్గు) | నస్యకర్మ్యయం దుపయోగించునది |
| ,, | 14 | ఛర్దికర్మ్యయం దుపకరించునది (శ్వాస) | వాంతిని అరికట్టునది. |
| 38 | 14 | శోషహరము | శోఫహరము |
| 40 | 9 | నాశ మొనరించునట్టివి. | నాశ మొనరించునట్టిది. |
| ,, | 11 | పూరించునది | హరించునది. |
| 46 | 3 | జేసియుండుదుయే | జేసియుండుటయే |
| 47 | 22 | పాతాగరుడ | పాతాళగరుడ. |
| 48 | 19 | మృగశి | మృగశింగ |